కళాభివర్ధనీ గ్రంథమాల. ౨.

# వామదేవ విజయము





గ్రంథకర్త:

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

కళాభివర్ధని గ్రంథమాలిక



# వామదేవ విజయము.

అను

## శ్రేష్ఠ చరిత్ర.



శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి ప్రణీతము.

మొదటి కూర్పు.

రాయవరము.

శ్రీ భారతీ తిలక ముద్రాక్షర శాల యందు నల్లమిల్లి సత్తిరెడ్డి గారిచే
ముద్రింపఁబడి గ్రంథకర్త గారిచే ప్రకటింపఁబడినది.

౧౯౧౩.

 ( వెల. ౦ - ౬ - ౦ లు.

శ్రీరస్తు.

సీ. ప్రథిత సత్తి "మహాస్వనాయూబ్ధి సోముఁడై
తగిన 'వీరన్న' యే సుగుడి తండ్రి
సంతత పతినామ చింతా పరాయణ
యగు 'బుల్లెమాంబ' యే యనఘు తల్లి
అమలాంత రంగ, భర్త్రంఘ్రి సంపూజన
పర 'వీరమాంబ' యే సరసు రమణి
సౌందర్య మూర్తులౌ 'సత్యనారాయణ
వీరనా' హ్వాయు లే యుదారు సుతులు

గీ. అలరు 'బొలమూరు' నకును సహాయదండ
నాధికారియైతండు, కావ్యామలామృ
తమ్ము సతతమ్ము గ్రోలు నెతండతండు
'వీరభద్రుండు' చంద్రికా విమలయశుఁడు

గీ. కొంతవఱకు లిఖించి హేత్వంతరమున
నిలిపి, క్రమ్మఱఁ బ్రకటింపఁ దలఁచి మదిని
దివిరి 'మిథునానురాగ' మన్ నవల రచన
సేయుచుండఁగఁ గూర్మి నెచ్చెలులగూడి

గీ. పరఁగ నూటుంటి కొకనాఁడువచ్చి, "రాను
దేవవిజయమ్ము" నాలించి తృప్తహృదయుఁ
డగుచు, స్వకులాభిమానమ్ము నాత్మఁగలఁచి
యచ్చువేయించె దీని నత్యాదరమున.

# పీఠిక



భూమంచిరెడ్లు దశ విధ రెడ్లలోని యొక శాఖ వారు. ఇందలి కథ యెందుండి గ్రహింపఁ బడినదో యాప్రబంధమున భూమంచి రెడ్లకుఁ బంట రెడ్లను నామాంతర మున్నట్లు చెప్పఁ బడినది. "భూమంచి రెడ్ల చరిత్ర"మను నొకయముద్రిత ప్రబంధము మాగ్రామ నివాసుఁడును భూమంచి రెడ్డియు నగు శ్రీయుత సత్తి సుబ్బారాయుని చెంత నున్నది. అది కఠిన శైలి నుంట నుపలక్షించి మద్భాగినేయుఁడగు శ్రీయుత మల్లాది బుచ్చి వేంకటరా వాప్రబంధము నందలి కథను సులభ శైలిని వచనముగ వ్రాసెను. దానిని మూల గ్రంథముతో నది చూచు చుండఁగా నాకీ వీర రస ప్రధానమగు కథ దొరకెను. అద్భుతముగ నున్న యీకథ నాటకముగ వ్రాసిన బాగుండు నని రూపకానుగుణముగఁ గొన్ని మార్పులుగావించి ౨౭-౧౦-౧౯౧౨ తేదీ మధ్యాహ్నము రెండు గంటలకుఁ బ్రారంభించి 3 -౧౧- ౧౯౧౨ తేదీ రాత్రి యెనిమిది గంటలకు ముగించితి.

అతిశయోక్తులు గల ప్రబంధముల సంగతి యటు లుంచి యాంధ్ర దేశ చరిత్రమును జదివిన వారికి రెడ్ల ప్రాభవము పౌరుషము సంగ్రామ వైదగ్ధ్యము మున్నగు నుత్కృష్ట గుణములు విశదము లగును. ఇప్పటికిని నైజాము రాష్ట్రము నందును దత్ప్రాంతముల యందును రెడ్ల వైభవము వెలుంగుచున్నది. శ్రీయుత విపిన చంద్రపాలుఁడు "నేనుత్తర సర్కారులలోఁ బ్రయాణము సేయుచుండఁగా నాఱుగురు రెడ్డి కులజులను జూచుట తటస్థించినది. నేను ప్రపంచము నందలి మూఁడు ఖండములను జూచితిని. కాని వారి కంటె దేహ దార్ఢ్యము గల వారిని జూచి యుండలేదు. వారి తేజః పటములను దీసి కొని "హిందూ మాతా! నీకు దేహ దా

ర్థ్యము లేదని యెవరు చెప్పఁగలరు?" అని వ్రాయఁ దలంచి కొంటి" నని వాక్రుచ్చెను. ఇప్పటికి నిట్టి యున్నత గౌరవములకుఁ బాత్రులై యున్న రెడ్ల పౌరుషమును నేను పూర్తిగఁ బ్రదర్శింపఁ జాలక పోయితి నేమో యని సందియ మగుచున్నది.

నా యీ నాటకము నామూలాగ్రముగ విని కు లాభిమానముచే ముద్రింపించిన శ్రీయుత సత్తి వీర భద్రునకును, నేఁ జేయు తొందరల కన్నిటికిని దాళి పది దినములలోఁ జక్కఁగా ముద్రించి యొసంగిన నా కూర్మి చెలి కాఁడును రాయవర గ్రామ వాసియు నగు శ్రీయుత మల్లిడి సత్తి రెడ్డికిని సంతోష పూర్వకము లగు ననేకాశీర్వచనములను గావించు చున్నాఁడను.

ఇందు దోషము లున్న మన్నింపఁ బండితులు ప్రార్థితులు.

౧౯ - ౨ - ౧౯౧౩.<br>
పోలమూరు, గోదావరి జిల్లా.

ఇట్లు,<br>
శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి,<br>
అష్టావధాని,

# ఈ నాటకమున వచ్చు పాత్రములు.



రామ దేవా రెడ్డి.

భానుమంత రెడ్డి.

ధర్మా రెడ్డి.

హేమ కూటా రెడ్డి.

నీల కంఠా రెడ్డి.

మహా దేవ రెడ్డి.

ప్రళయ భైరవుఁడు.

చంద్ర సేనుఁడు.

సుబాహుఁడు.

వీర సేనుఁడు.

గోపాల వర్మ.

ఇంకను బ్రాహ్మణుఁడు పరిచారకులు మొదలయిన వారు వచ్చెదరు.



దహన సమ్మిళితాసూయా విదగ్ధ హృదయ
మగుచు దండెత్తి వచ్చెఁ జౌర్య ప్రవృత్తి.

సూత్రి—ఏమీ? క్షత్రియులు రెడ్లతోఁ బోర వచ్చినారా?

మారి—ఆవార్త క్షణము క్రిందట సార్వభౌమునకును, నిప్పుడె పౌరులకును దెలిసినది. పౌరు లా విషయమును గుఱించియే కళవళ పడుచున్నారు. క్షత్రియులతోఁ బోరుటను గుఱించి సార్వభౌముఁడు గొలువు దీర్చునఁట.

సూత్రి—అట్లయిన మన మటకుఁ బోయి చూచి వత్తము రమ్ము.

( ఇరువురు నిష్క్రమించుచున్నారు. )

ఇది ప్రస్తావన.



శ్రీ ర స్తు.

# రా మ దే వ వి జ య ము.

## ప్ర థ మా ం క ము.

[ కొ లు వు కూ ట ము. ]

(రామదేవారెడ్డి, భానుమంతరెడ్డి, ధర్మారెడ్డి, హేమకూటారెడ్డి, తగు పరివారము ప్రవేశించుచున్నారు.)

రామ—తమ్ముఁడా! ధర్మారెడ్డీ! చంద్రసేనాది క్షత్రియులు మనపై దండెత్తి వచ్చుచున్నారను వార్త నిజమేమై యుండునా?

ధర్మా—అన్నా! సార్వభౌమా! నిజమే యని చెప్పుట కనేక కారణము లున్నవి.

సీ. క్షత్రియుల్ పాలించు సకల రాజ్యమ్ములు
మనవారు మును లాగికొనుట యొకటి
జన పాలనమొనర్చు క్షత్రియు లెల్లను
నొగిఁ గప్పముల నిచ్చుచుంట యొకటి
క్షత్రియులకు నెందు స్వేచ్ఛంద విహరణ
మ్మొనరింప వీలు గాకుంట యొకటి
ఒకనాటికన్న మఱొక్క రోజున మన
మొగి వృద్ధిఁ గాంచుచు నుంట యొకటి
గీ. క్షత్రియుల్ గొంతమంది దుర్గర్వము విడి
గౌరవముతోడ మన చెంతఁ జేరుటొకటి

బాహుజులు మనపై నెత్తి వచ్చుటకుఁ గ
సంగ నివి యన్నియును గారణములె గావె?

రామ—తమ్ముఁడా! వారు మనకు సామంతులరై యున్నారని మనము వారి నగౌరవము సేయుచున్నామా? వారు మనకన్న జాతిచే ఘనులగుటచే నుచిత గౌరవము లొనర్చి మన కొలువున నగ్రస్థానం బొసంగుచునే యున్నారము. "నాల్గవ జాతివారగు భూమంచిరెడ్లకు మనము సామంతులమై యుండమా" యని దురభిమానమున నేవియో కొన్ని స్వల్ప కారణములను జూచికొని, మనము వారికిని, దేశమునకును జేసిన యుపకారములను మఱచి మన మీఁదికి వచ్చెదరా?

ధర్మా—మీ కాసందియమేల? ప్రజా సౌఖ్యము నపేక్షించు వారెవరు నిట్ట్యెడ మన మీఁదికి రారు. కాని క్షత్రియు లిప్పుడు దురభిమాన చేతస్కులై యున్నారు. దురభిమానము వలన నేమి గాదు?

గీ. ధర్మమును వీడఁ జేయుఁ, గ్రోధమ్ము బెంచుఁ
ప్రాణముల మీఁది యాసను బాయఁజేయుఁ
దనయు నెడనైన బంధు బంధమ్ము ద్రెంచు
దురభిమానమ్ముచేఁ గాని దురితమున్నె?

కావున క్షత్రియులు దప్పకుండ దండెత్తి వచ్చెదరనినమ్మవచ్చును.

భాను—(ధర్మారెడ్డితో) వచ్చిన?__

హేమ—యువరాజా! వచ్చిన నేమున్నది?

మ. అసమంబై, విలయ ప్రచండ దహనోగ్యత్ఖడ్గ ధారా శిఖా
విసరంబై, తురగాంఘ్రి ఘట్ట జనితోద్వేల స్ఫులింగమ్మునై,
యసమాగ్న్యాయుధధ్వాంధమారవయుతంబౌ రెడ్లసచ్ఛౌర్యమ౯
లసదగ్నిం బడి ప్రమ్మగ్గి పోదు రిఁక నేలా? సందియమ్మూనగ౯.

భాను—సందియమేల? రెడ్ల శౌర్యాగ్ని కడ్డు గలదా?

గీ. క్షత్రియుల శౌర్య వహ్ని దుస్తరమ్మె యైన
రెడ్ల శౌర్యాగ్నిచేత నిర్జింపఁ బడును,
ఉదక మగ్నిని నార్పివేయు నదె యైన
నింతలో బాడబాగ్నిచే నింకి పోదె?

ధర్మా—బళి బళీ! వత్సా! నిజము సెప్పితివి. మనతోఁ బోర వచ్చి క్షత్రియులు విజయము జేకొని మఱలఁ దమ రాజ్యములకుఁ బోవఁ గలరా?

గీ. సింగము వసించు గుహను వసింప వచ్చుఁ
బెద్ద పులి మీసముల నులి పెట్ట వచ్చుఁ
గోసరి శేషుని పండ్లూడఁ గొట్ట వచ్చు
రెడ్లను జయింపఁ దరమె? క్షత్రియుల కెందు.

రామ—మనము చేసిన యుపకారములను దలంచికొనియు, దుస్సహమగు మన శౌర్యమును దలంచుకొనియు క్షత్రియులు మన మీఁదికి రానే రారు. అట్లుగాక,—

చ. విరివిగ మండు మంటఁ గని వే మధురమ్మగు పండటంచు సం
బరమున వ్రాలి గిట్టు శలభమ్ములపోలిక, రాచవారు సం
గర మొనరింపఁగాఁ దలఁచి గర్వముతో మన పైకి నెత్తి సం
బరమున వచ్చిరేని వడి మచ్చర వహ్నిని మ్రగ్గి పోవరే!

హేమ—సార్వభౌమా! రాచవారు మనతోఁ బోర వచ్చుటయే నిజమగు నెడల యుద్ధమునకు మీరు సైతము రావలెనా?

చ. హరిణ చయమ్ముఁ గూల్చెడిని వ్యాఘ్ర కిశోరమొకండె, మత్త భీ
కర కరులన్ వధించెడిఁ జకాపిక సింగపుఁ బిల్ల యొకండె, యు
గ్గరుడుఁ డొకండె వేడ్క నెసకం బెసఁగన్ ఫణి కోటి నుబ్బుమై
నెర గొను నట్లు నే నొకఁడనే రిపు కోటిని గూల్చి వచ్చెదన్.

రాఘు—హేమకనాటారెడ్డీ! నీవట్టి వీరుఁడవే.

గీ. కరమునందుఁ గరాళ ఖడ్గమ్ము దాల్చి
భీమమ్మైనట్టి సంగ్రామ సీమ నిలిచి
రేఁగి కను లెఱ్ఱ జేసిన రిపు బలమ్ము
లడలి యోడవె? నిల్చిన మడిసి పోవె?

భటుఁడు—(ప్రవేశించి) జయము జయము సార్వభౌమా!

(అని యొక జాబు నొసఁగు చున్నాఁడు)

రామ—నీ వెచ్చటి వాఁడవురా?

భటు—దేవా! పాశుపతరెడ్డి గారి చెంత నుండి వచ్చితిని.

రామ—అచ్చటి విశేషము లేమి?

భటు—దేవా! చెప్పుటకు నోరాడ కున్నది.

రామ—ఏమిది? తమ్ముఁడా! ఈజాబునం దేమున్నదో త్వరగఁ జదువుము. (అని యిచ్చుచున్నాఁడు)

ధర్మా—ఆలకింపుము. (అని చదువును)

దేవా! వ్రాయుటకు జే యాడ కున్నది. కృతఘ్నులగు సుబాహు చంద్రసేనులు నీచులగు కొందఱ క్షత్రియ నృపాలురం గలుపుకొని దేవర వారి సార్వభౌమత్వమునకుఁ గళంకము గల్గింప వలెనని తలంచి మన దేశమునం జొచ్చిరి. కొంత సేనతో నే నిటఁ బోరు చున్నాఁడను. కాని నాతోఁ బోరు సేనలో సుబాహు చంద్రసేనులు లేరు. వాం డ్రిరువురు నగణ్య వాహినిం గూర్చుకొని గ్రామములను ధ్వంసము గావించుచు వేఱొక త్రోవనుండి దేవర వారి నరి కట్ట వచ్చు చున్నారు. ఇచ్చట నాకేమియు భయము లేదు. పరాక్రమ సంపన్నమగు రెడ్డి కులమునం బ్రభవించిన నేను క్షత్రియులకు జంకు వాఁడను గానని విన్నవించుకొనుచు

న్నాఁడను. ఇంతే సంగతులు.

దివ్య చిత్తమునఁ జిత్తగింపవలెను.

ఇట్లు,

విధేయుఁడు,

పాశుపత రెడ్డి, రాజప్రతినిధి.

రామ—ఏమీ, క్షత్రియులు మన రాజ్యములోనే ప్రవేశించినారా? తమ్ముఁడా! సేనాధిపా! ప్రియతనయా! రాచవారు మన పై దండెత్తి వచ్చుట సత్యమో, కల్లయో, కింవదంతియో యని యోచించుకొనుచుంటిమి. కాని వారిదివఱకే మన రాజ్యములోఁ బ్రవేశించిరని యెఱుంగమైతిమి. ఏమీ క్షత్రియు లెంత సాహసించిరి!

సీ. చాల గాలమునుండీ సమరముల్ సేయమి
భీరు లటంచు భావించినారో
కన రెడ్ల శౌర్యము క్షాత్ర శౌర్యముకంటె
డీసిపోవు నని చింతించినారో
రెడ్లఁ గూలిచి చెలరేఁగి దేశమునుగొంట
యెంతసేపని మది నెంచినారో
దురమొనర్పఁగ లేక శరణంచుఁ దమ్ము బ్రా
ర్థించెద రంచు నూహించినారో
గీ. మానమే ప్రాణముగ నెంచి మొసలువారు
బగతురం గెల్వఁగాఁ జాలు బాహుబలులు
ధైర్యధుర్యులు నిస్తుల శౌర్యయుతులు
నైన భూమంచి రెడ్లమే మను చెఱుఁగరో.

ఏమీ క్షత్రియుల ధైర్యము!

గీ. కనఁగ దామెంత? తమ పరాక్రమ మదెంత?
మొనసి మన దుర్గముల నెల్ల ముట్టడించి
అని మనల గెల్చి దేశమ్ము లాక్రమించి
ప్రాణములతోడఁ బోదురే ప్రాభవమున?

శానిందు. రెడ్ల శౌర్యమును వీరు మఱచి పోయిరి.

ధర్మా—ఆఁ! కొదమ సింగములతోఁ జెరలాట మాడఁ జూచుచున్నా రీ క్షత్రియులు! ప్రాణములపై నాశ లేనట్లున్నది.

ఉ. అగ్ని శిఖా నిభంబులగు నాయుధముల్ ధరియించి యుద్ధ సం
లగ్న మనమ్మునం గని హాళాహళితో నరిసైన్యము ల్గూడఁ, గా
లాగ్ని విధమ్ముగా నడరి యాహవరంగము నందుఁ జొచ్చి నే
భగ్నము జేసి వైతు నరి పార్థివ శుష్క చమూ మహాటవిన్.

భాను—పాప మీ రాచవారు భ్రాంతి పడిరి.

సీ. కలికి రూపముల ముద్దులు మూటఁ గట్టెడి
గువ్వపిట్టల పిండుఁ గూల్చుటయును
గఱకుఁ గత్తులు గాళ్లఁ గట్టి పందెము వైచి
వెసఁ గోడి పుంజుల విడుచుటయును
బూరి మేయుచు సాధువు లటంచుఁ జేరొందు
కొమరారు లేళ్లను గూల్చుటయును
రమ్యమైనట్టి పారావతాదిక పక్షి
వితతిపై డేగల విడుచుటయును

గీ. నని తలఁచిరేమొ రాచవా రాహవమునఁ
గదన రంగమ్ము ప్రాణాంత కమ్మటంచుఁ
గలన భూమించి రెడ్లు సింగము లటంచు
నెఱుఁగ రీ రాచవార లొక్కింత యేని.

కానిండు. నేటికి నా కోరిక ఫలించినది.

గీ. చాల గాలమ్మునుండి నే సంగరమ్ము
సేయ నుండఁగ సమయమ్ము చిక్క లేదు
ప్రబల సంగ్రామ మిప్డు సంప్రాప్తమయ్యెఁ
జూపి వచ్చెద నాదు ప్రతాపమంత.

రామ—తమ్ముఁడా! చూచితివా మన సాత్విక గుణ మెట్టి యవస్థను దటస్థింపఁ జేసినదో? సత్పథమున రాజ్య పరిపాలనము గావించు చుండిరి గదా యని స్నేహ భావంబుతో మెలంగుచుండఁగా [illegible] మీఁదకే వచ్చిరిగా రాచవారు? మన తండ్రిగారి నాఁటనుండియు [illegible] ర్వభౌమత్వమున నేమియు యుద్ధములు జరుగకుండుటచే [illegible] లై పోయిరని తలంచినారు కాఁబోలు నీక్షత్రియులు [illegible] దుహ, ధనము వ్యర్థముగా వమ్మయిపోవును. [illegible] కు యుద్ధము సేయుట యని యింతవఱకు [illegible]. కాని,—

క. ఏ నరపాలుఁడు పర భూ
జానులతోఁ బోరఁ బ్రజ కసౌఖ్య [illegible]
దానెంచి రాజ్య మేలునొ
యా నృపతి నశించుఁ దుదకు [illegible]

[illegible] మాత్రము మించి పోయిన దేమి? [illegible] పాలనుండ మనకేమి లోపము గలుగును? [illegible] ప్రపంచమునం గల క్షత్రియు లంద ఱేకమై వచ్చి [illegible] వెఱతుమా?

భాను—జనకా! వెఱచుటా? రెడ్డినై పుట్టినవాఁడు [illegible]

క. పరవీరుని ద్రుంచును సం
గరమున శౌర్యమ్ము మీఱఁ; గాకు. డినచో

మరణించును బోరాడుచు
వెఱచుని పోరనిన రెడ్డి వీరుండరయన్.

అదియుఁ గాక,— యుద్ధము జేసి జయించినచో భూలోకమున ననంత సుఖములను సత్కీర్తిబడయవచ్చును. చచ్చినచో వీరస్వర్గమున యథేచ్ఛగ విహరింప వచ్చును. పోర వెఱచిన నేమున్నది? యుద్ధము సేయ వెఱచిన వారికి సుఖము దక్కదు. అపయశము సంభవించును. లోభులు కాకులువలెఁ బ్రతికెదరు. మానాభిమానములు గలవాఁడెవ్వఁడు పోర వెఱచును?

రామ—తనయా! శూరునకు యుద్ధములోఁ జచ్చుట పెండ్లియాడుట వంటిది. ఈ దేహము సుస్థిరము కాదు గదా? చావెప్పుడైన నున్నదే. చావునకిన్ని చావులున్నవా?

హేమ—నిజము నిజము సార్వభౌమా! మానవుని కాయుః ప్రమాణమును నిర్ణయించు బ్రహ్మకుఁ గూడ వినాశమున్నది. పౌరుషముతో బ్రతికిన బ్రతుకొక్క నిముసమైనను జాలును. పౌరుషము లేని బ్రతుకు వేయేండ్లు బ్రతికిన నేమి లాభము?

రామ—పరాక్రమైక ధనుఁడగు సుకర్ణ రెడ్డి స్వవంశమున జనించితిని. సార్వభౌముఁడనై సల్వానిచే మేలు మేలనిపించుకొనుచుంటిని. అట్టినేను సామంత నరపాలు రిపువుకు పరాక్రమలవ దుర్విదగ్ధులై దండెత్తి రా వెనుదీసెదనా?

గీ. మానమే ప్రాణముగ నెంచి మనలుచుంటి
సంశయింపక పోయెద సమరమునకుఁ
జేత నైనచో శత్రులం జీల్చి వైతుఁ
జేతఁ గాకున్న శత్రుల చేతఁ జత్తు.

భాను—మేలు మేలు! జనకా! అదియే పౌరుషము!

రామ——తనయా! నీవును, సేనాని హేమకూటారెడ్డియు, నాతమ్ముఁడు ధర్మారెడ్డియు, సాహసోద్ధారావతారులగు పెక్కండ్రు రెడ్డి మహాజనములును, నగణ్య సైన్యమును, నసాధ్య దుర్గమును, నుండఁ బరాక్రమింపక యేను భయపడ నేల?

ధర్మా——ఛీ! ఎంత యొప్పని పని జేసిరీ రాచవారు!

గీ. వీర వరుల మటంచును బేరుఁ దాల్చి
కూల్చి మమ్ముల రాజ్యముల్ గెల్చి కొనఁగ
వెనుక దీయక మది;దొంగతనము గాగ
రణము సేయఁగ వచ్చిరే రాచవారు!

రామ——సగౌరవముగ మన చెంతకు వచ్చి ప్రార్థించినచో మన రాజ్యమంతయు రాచవారికిచ్చి వైతుమే! ఇఁక వీరి యెడల దయఁ దలఁపఁ గూడదు. తమ్ముఁడా! సేనాధిపా! తనయా!

చ. ఉడుగక ద్రోహముల్ సలుప; నోర్వఁగఁ జాలక రెడ్ల సంపదల్
బొడఁగని; రెడ్లతో నెదిరి పోరఁగ వచ్చిరి రాచవార; లి
య్యెడ కరుదెంచు దాఁక నిటు లిచ్చట నుండఁగనేల కావునన్
బొడవడఁగింపఁగా మనమె పోరము రండు రొడ్డి పోరఁగన్.

భాను——ఆ యాలోచనమే బాగున్నది. ఇచ్చటకు వచ్చునంత దనుక నూరకున్నచో రాచవారనేక జనపదములను గొల్ల గొట్టి చీకాకు పఱచెదరు. ప్రజలకు మిగులఁ గష్టము సంభవించును. కావున మనమెదురేగుటయే మంచిది.

ధర్మా——రాజనీతియు నదియే గాదా? కావున మనము త్వరగ నెదుర్కొనవలెను.

హేమ——అన్ని విధముల నదియే బాగున్నది. ఏమన?

సీ. పోరాడ వచ్చిన వారల పేరానఁ
దాలుతనే గంగలోఁ గలుప వచ్చుఁ
గరము సౌఖ్యమ్ములు గను జానపదులకుఁ
జెఱుపు లేకుండఁగాఁ జేయవచ్చు
బహిరంగముగ రాచవారితోఁ బోరాడి
రెడ్ల శౌర్యమ్ము బూరింప వచ్చుఁ
జెలఁగి క్షత్రియులకు శృంగ భంగము సేసి
వచ్చిన దారినే పంప వచ్చు
గీ. నతులమైనట్టి సత్కీర్తి నంద వచ్చు
నెన్ని విధములఁ జూచిన యేని రాచ
వారితో రహి నెదు రొడ్డి పోరు సల్పు
టరుగుటయె పౌరుషమ్ము తథ్యమ్ము గాఁగ.

పాపము! రాచవారు రెడ్లను గెలిచెదనుకొంతయనుకొనిరి కాఁబోలు! ఈ పాఱుఁడు, మౌని, యొక్కఁడగు భార్గవ రామునితో నెదిర్చియే పోరఁగ లే కెల్లగను భూస్థలిఁ గూలిరి రాచవారు; న ద్రోహులు, శౌర్య భూమిపులు, పెక్కఁ అనేక మైన రెడ్డి వీరులన్ బోరి జయించి వైచెదరు పోలును వారికి! రాచవారికన్.

రామ—హేమకూటారెడ్డీ! క్షత్రియులు పరాక్రమ హీను లని తలంచు చుంటివి గాఁబోలు. కాదనుమా.

క. వారును శౌర్యాన్వితులే
వారి నెదిరి పోరుటరయఁ బైపై పనిగా
దా రాచవారి నెదిరిచి
పోరి గెలుచు వారె ఘనులు పుడమి నిజముగన్.

హేమ—అగుఁగాక,— శూరునకు శూరుని తోడనే పోరాడ నగు

ను. అంతియే గాని పాటు పందలతోఁ బోరనము కట్టు టేటి న్యాయము? వారు శూరులు గావుననే నాకు సంతసము గానున్నది.

భాను——హేమకూటా రెడ్డీ! నీకేగాదు. నాకును సంబరమే.

ధర్మా——ఇందు సంతసము లేని వా రెవ్వరు?

రామ——అదియుఁ గాక,——సేనాధిపా! ఒక్క పరశురామునే జయింపలేక పోయిరి క్షత్రియులు. అట్టి క్షత్రియకుల సంజనితుల మీఁదికిఁ బనుగు రేగు టేటి న్యాయము?

భాను——జనకా! అట్లయిన న న్నొక్కనినే పంపుఁడు.

రామ——భానుమంతా! యుద్ధమునం గల తమకముచే నట్లనుచుంటివి. కాని బాలుఁడవగు నీవంత పని సేయఁగలవా?

భాను——నిజముగఁ గన్నులెత్తిఁజేసి చూచిన నాకదెంత పని?

సీ. స్వచ్ఛమై పర్వత సదృశమగు తూలరా
శిఁ బడ్డ ఘోరాగ్ని కణము వోలెఁ
గరికొంగనిగమిఁ జోలు కరి సమూహమ్ములోఁ
బడినట్టి సింహ శాబకము వోలె
సర్పసముదాయమ్ముచుఁ దనరారు హరిణసం
ఘమ్ములోఁ బడిన వ్యాఘ్రమ్ము వోలె
దండ తాడిత సర్ప మండలిలో వేగ
వచ్చి వ్రాలిన ఖగ భర్త వోలె
గీ. భవ్య వికచారవింద సంభరిత మైన
కొలనిలోఁ బడ్డ యేనుంగుఁ గోడమ వోలె
వీర లోకమ్ము నుతియింప వే విధములఁ
జిదిమి వైచెద క్షత్రియ సైన్యములను.

రామ—మేలు మేలు కుమారా! శ్రేష్ఠ పౌరుషమును నిలిపితివి, అంతియే చాలును.

భాను—ఏమీ? అంతియే చాలునా? ఏను చెప్పుటయే గాని చే ప్పినట్లు చేయఁ జాలని వాఁడనా?

క. పలుకుట యే గాదిక నేఁ
బలికిన విధముగను వైరి పార్థివులను వే
బలి యిచ్చెద బగళాంబకుఁ
బలుకను నే నెప్పుడే నబద్ధము జనకా!

అదియుఁ గాక,—ఏను బాలుఁడ నని మీ రెంత మాత్రమును దలఁ ప వలదు. నాకు బాల్యము దేని యందు? శౌర్య ధైర్యముల యందా వయస్సునందా? తండ్రీ! ఇటు వినుము

ఉ. బాలుఁడనో, విరోధి నరపాల సమాజము దూల్చి నైచు నా
కాలుఁడనో, ఘంటింగెదరు ఖడ్గముఁ జేకొని, భీకరాక్కి, యు
ద్వేల మునమ్ము మీఱి మటి; వీర విహారము నేసి వైరి భూ
పాలురఁ ద్రుంచు నప్పుడిది వచ్చెడి మీనమునున్ను క్రొత్తగన్

హేమ—యువరాజా! మీ రంతటి వారే. కాని నేనుండఁగా యుద్ధము లోనికి మీరు రా నక్కఱలేదు. యుద్ధము సేయుట నా పని

భాను—నీవు పొరపడినావు. సంగరము సేయు టెవరి పనిగాదు ఎవరు సమర్థులో వారెల్లను సంగ్రామ మొనరింప వలసినదే. నేనును స మర్థుఁడను. అదియుఁగాక, యువరాజ నగుటచేఁ దొలుత నేనే సమర మునకుఁ బోవలెను.

రామ—ధర్మారెడ్డీ! ఇఁక జాలము సేయనేల? దుర్గ రక్షణార్థమై శరభాంకరెడ్డిని నియమించి, మహాదేవరెడ్డిని దన పటాలముతోఁ బాశ

పతిరెడ్డికి సాయము సేయఁ బోవుట కాజ్ఞాపించి, మన ప్రయాణమునకుఁ దగిన ప్రయత్నముల నతి త్వరగఁ జేయింపుము. ఈ దినమునందే మనము ప్రయాణమై పోవలెను. సోమకూటారెడ్డీ! నీవు మిగిలిన సర్వసైన్యము ను సన్నాహము గావించి సిద్ధముగ నుండుము. భానుమంతా! నీవు గూడ సిద్ధముగ నుండుము.

శా. మానమ్ముం ద్యజియించి వైచి, ఘనమా మర్యాద వోనాడి, దే
శానర్ధమ్ము గణింప కింతయును ద్రోహమ్మంచు డెందాన నుం
తైనన్ గొంకక వచ్చిరే రణము సేయన్ రాచవా రీసుమైఁ?
గానిమ్మి య్యెడ నేమి మించె? ధర సత్పాత్రమ్ము గావించెదన్.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

హేమ——అస్మద్దోర్దండ ప్రభావమును జూప సమయము వచ్చినది!

ఉ. చండ కృశాను కీలలకుఁ జండతఁ గల్గఁగఁ జేయఁ జాలు న
ద్దండ కరాళ ఖడ్గమును దాల్చి మహా శితికంఠుఁడో యనన్
భండన సేయు వైరి నరపాల కిరీట సముజ్జ్వల చ్ఛిరః
ఖండన మాచరించెదఁ జకాపిక రెడ్ల ప్రతాప మేర్పడన్.

భాను——ఓ సుబాహు చంద్రసేనాది క్షత్రియులారా!

గీ. ధరణి ధరశిఖరము నుండి యుఱికి గాండ్రు
గాండ్రు మని వచ్చు కొదమ సింగంబ నగుచు
వచ్చుచున్నాఁడ నే నిదే బవరమునకుఁ
గాచికొనుఁ డరి యోధ నాగమ్ములార!

(అని నిష్క్రమించుచున్నాఁడు)

ధర్మా—(తనలో) అన్నగారికి మిగులఁ గోపము వచ్చినది. క్షత్రియులవివేకులై యకృత్యమును గావించినారు. అన్నగారి యౌద్ధత్యము జూడ భూతలము నిఃక్షత్రము జేసి వైచునట్లు తోఁచుచున్నది నేనుత్వరగఁ బోయి జైత్ర ప్రస్థాన ప్రయత్నములను జేయ వలయును.

( అందఱు నిష్క్రమించుచున్నారు )

ఇది ప్రథమాంకము.



శ్రీ ర స్తు.

# రామదేవ విజయము.

## ద్వితీయాంకము.



[ యుద్ధ భూమి. ]



(సుబాహు చంద్రసేనులు ప్రవేశించుచున్నారు)

సుబా—మిత్రమా! చంద్రసేనా! రెడ్ల సేనా సాగర మెంత గంభీరమై యున్నది!

చంద్ర—మిత్రమా! సుబాహు భూపతీ! రెడ్లు మాత్రము సాహసు లనుకొంటివా?

మ. సరసాగ్రేసరు, లద్రి ధైర్యులు, విరాజత్కీర్తు, లుద్యద్ధరా
వరచూడామణు, లంగజాకృతులు, దివ్య ద్భోగదేవేంద్రు,లు
ద్ధురమిత్ర ప్రతిమ ప్రతాపులు, లసద్దోర్వీర్య లెన్నంగ, భీ
కర సంగ్రామ రహస్యవేదు లరయంగా రెడ్లు సామాన్యులే!

సుబా—ఆహా! ఏమి వారి రణోత్సాహము! చంద్రసేనా! ప్రభావమూర్తియై వెలుంగుచున్న యాతఁడే నా చక్రవర్తి?

చంద్ర—ఔను.

సీ. కోమరు గులాబి పుష్పము పోల్కి నందమై
కర మలరారు పాగా ధరించి
తులలేని కాంతిచేఁ దళతళ మను మగ
రాలచే నొప్పు తురాయి దాల్చి

రవి గభస్తి ప్రసారము కన్న మిఱుమిట్లు
గలిగించు చండ ఖడ్గమ్ము ఝళిపి
వదనమ్ము మీఁద పాఱంబట్టు కుచ్చుల నొత్తి
చెలఁగు మీసముల ద్రిప్పఁ జేయి ద్రిప్పి

గీ. వీర రస మూర్తియో యన వెలుఁగుచున్న
యతఁడె రామదేవా రెడ్డి యనఘ! చిన్న
రెడ్డి యంచును, వసుదామ రెడ్డి యంచుఁ
బ్రజలు పిలిచెదు నా సార్వభౌముఁడతఁడె.

ఉ. బెబ్బులి మీసమైన మెలిపెట్టి హుటుక్కునఁ ద్రెంపవచ్చు; బల్
గొబ్బునఁ ద్రాఁచుపాము మును కోఱల భోరన నూడ్చవచ్చు; బె
న్నిప్పర మైన తాల్మి మృగ శత గుహాన్ వసియింపవచ్చు; నో
య్యబ్బ! తరంబె యీ ఘనుని నాహవమం దెదిరించి పోరఁగన్.

చెలికాఁడా! చక్రవర్తి కుడి ప్రక్కనున్న బాలునిఁ జూచితివా?

సుభా—చూచితిఁ జూచితి. ఆహా! ఏమి యీ బాలకుని ఠీవి!

చ. కనకపు సారసమ్మునఁగఁ గ్రాలు కరమ్మును జేర్చి చెక్కుటన్
సునిశిత కృష్ణ నమ్ములను సొంపుగఁ జిమ్ముచుఁ గన్ను దోయి మం
దనుపమమైన ఖడ్గమును నాని కరమ్మున దేహి చెంగటన్
దనరుచుఁ గూరుచుండిన యతం డెవఁడో వచియింపు నెచ్చెలీ.

చంద్రి—ఆ బాల వీరుఁడు చక్రవర్తి జ్యేష్ఠ సుతుఁడు. యువరా
జా, అతని పేరు భానుమంత రెడ్డి. సఖా! అతఁడిప్పుడు బాలుఁడైనను
దండ్రి యంతటి వాఁడు సుమా!

సుభా—ఆఁ! అంతటి పరాక్రమవంతుఁడేమి?

చంద్రి—ఔను. చక్రవర్తి వామ పార్శ్వమునఁ గూర్చుండిన
యాతనిం జూచితివా? అతఁడు,—

మ. అనుజుండై, ఘన మంత్రి వర్యుఁడయి, సేనాధీశుఁడై, సార్వభౌ
మునకుఁ, రాజకళా విశారదుఁడునై, ప్రోద్యత్ప్రతాపుండునై,
యనఘాత్ముండయి, ధైర్యధుర్యుఁడయి, దివ్యాస్త్రగ దేవేంద్రుఁడై,
మనుజ శ్రేష్ఠుఁ డటంచుఁ బేర్వడసిన ధర్మారెడ్డి సుమిత్రా సఖా!

నెచ్చెలీ!

గీ. అన్న గారిని మించు శౌర్యమున ననుజుఁ
డనుజునికి మించు నన్న శౌర్యమ్ము నందు
ఒకని కొక్కఁడు దీసి పోఁ డొకపుడైన
నిరువురు సమాను లన్నింట నెంచి చూడ.

సుబా—ఆ యన్నదమ్ముల యదృష్ట మది. మిత్రమా! నా తమ్ముఁ డొక్కఁడే లఘు హృదయుఁడై విష యోప భోగములం గాలము బుచ్చుచు నా కప కీర్తిని గలిగించు చున్నాఁడు. కాని యిఁక నెవ్వ రన్న గారి మాట నతిక్రమింతురు? వారి తలి దండ్రులు గడు నదృష్టవంతులు.

గీ. శౌర్య ధైర్య పరాక్రమ సాహసముల
యందు నన్యోన్యమును దుల్యులైన వారు
ప్రేమ గల్గిన వారు నేరికి జనింతు
రిలను గనఁగ నదృష్ట వంతులకె గాక.

చంద్రి—నీ తమ్ముని సమాచార మంతయు నీ విప్పుడు మఱచి పొమ్ము. ఇది యుద్ధరంగము. ఇం దెంత మాత్రము ధైర్య మొడలఁ జేసికొనినను ముప్పు వాటిల్లును. మిత్రవర్యా! కుడి చేతఁ గరాళ దీర్ఘ కరవాలమును, డా కేల భయంకర భల్లమును దాల్చి యారక్త నేత్రుఁడై, భయంకర వదనుఁడై మదించిన దిగ్గజము వలె యువరాజు చెంతం గూర్చున్న యాతనిం జూచితివా? ఆతఁడే సర్వ సేనాధిపతి. అప్రతిమ బాహా బలశాలి. అతిశయ శౌర్య సంపన్నుఁడు. గిరి ధైర్యుఁడు. సాగర గంభీరుఁడు.

ఆతఁడు రిక్తహస్తుఁడై బెబ్బులినైన ననాయాసముగ మడియింపఁ గలఁడు
ఆతని పేరు హేమకూటా రెడ్డి.

సుబా—సర్వ సేనాధిపతియగు హేమకూటారెడ్డి యాతఁడేనా?

చంద్రి—ఔను. కాని యాతఁడెంత పరాక్రమవంతుఁడైననుసంక ల్ప మాత్రమున నాతని జయింప వచ్చును సుమా! ఏ మందువేని,—

గీ. ఎంతటి పరాక్రమంబున్న నించుకేని
యును బరేంగిత జ్ఞానమ్ము నొందకుంట
గడియలో నాతఁడు జయింపఁబడును సుమ్ము
వారణ మ్మొక్క నిముసానఁ బట్టువడదె?

సుబా—ఏమీ? ప్రతివీరుని యభిప్రాయము నంత మాత్రమున గ్రహింపఁ జాలఁడా? అట్టి వానికిఁ జక్రవర్తి సర్వ సేనాధిపత్య మెట్లొసంగెను?

చంద్రి—తన కొలువులో నంత కన్నఁ దెలివైన వాఁడు లేక పోవుట చేత.

సుబా—(ముందుకుఁ జూచి) కటకటా! రెడ్ల సేనను బరీక్షించుటకై మాయ వేసమున మనచే నంపఁబడిన గోపాల వర్మ రెడ్ల చేఁ జిక్కిపోయినాఁడు.

చంద్రి—ఏమీ? గోపాలవర్మ రెడ్ల చేఁ బట్టువడెనా? (చూచి) ఏమీ? హేమకూటారెడ్డి మండి పడుచున్నాఁడు. ఏమి సేయుదునో గదా!

సుబా—రామదేవా రెడ్డి మంద హాసము జేయుచున్నాఁడు. ఏమి యీ వింత! యువరాజు గోపాల వర్మను వెంటఁ బెట్టుకొని పోవుచున్నాఁడు. ఎచ్చటికై యుండును?

చంద్రి—ఏమియుఁ దోఁచుట లేదు. వారిరువురు సేనా మధ్యమునఁ బ్రవేశించుచున్నారు గోపాల వర్మను ఖైదు సేయుట కేమో.

సుబా—ఖైదు సేయుట కైనచో గోపాల వర్మ తనకుం దా నై యువరాజు వెంటఁబోవునా? ఏ మైనను గోపాలవర్మ మనకిఁకఁ దక్కఁడు.

చంద్రి—అంతియేనా?

సుబా—అంతేగాక మఱే మున్నది? కాని చంద్రిసేనా! చక్రవర్తి యిరు పార్శ్వములు నున్న వారిలోఁ గొందఱు క్షత్రియు లని తోఁచు చున్నది. వా రెవరు?

చంద్రి—వారు క్షత్రియులే.

సీ. కోసలాధీశుని కూర్మి పుత్రుల లోనఁ
బెద్ద బృహద్బలాభిఖ్యుఁ డొకఁడు
అతని వెన్కనె నాతని తమ్ముండు
భీమకర్ణాఖ్యుండు వీర వరుఁడు
ఒక ప్రక్క పీఠి గూర్చున్న యాతఁడు కాళ
హస్తి పురేశ్వరుఁడపమ బలుఁడు
ఆతని వెన్క వాఁ డంగ దేశ విభుండు
ప్రద్యుమ్నుఁడను వాఁడు ప్రథిత బలుఁడు

గీ. వార లెల్లఱు క్షత్రియ వీర వరులె
అప్పనమ్ము నొసంగ రావంత యైనఁ
జక్రవర్తికి; నాతండు సరసుఁ డగుటఁ
గారవించు నగ్గిలి రాచ వారటంచు.

సుబా—అక్కటా! దురాత్ములు క్షత్రియ కులమున కెంత యపకీర్తిని గల్గించి నారు. తాము రెండవ జాతి వారయ్యు నాల్గవ జాతి వారగు రెడ్ల నాశ్రయింప నెట్లు సమ్మతించిరో?

ఓరోరీ క్షత్రియ హతకులారా!

మ. అరరే! యెంతటి క్రూర కర్మ్మ లమలంబై, పూజ్యమై, పౌరుషా
కరమౌ క్షత్రియ వంశ మెంతయు వెలుంగన్ బుట్టి వైరి క్షమా
వర మత్తేభ మృగేంద్రులై, ఘన రణ ప్రావీణ్యులై, క్షత్రియే
తర భూమీశ్వరు మిత్రులై స్వకులముల్ ధ్వంసమ్ము గావింతురే!

ఛీ ఛీ! మీకు మానాభిమానములు లేవా? మీరు కేవలము నిశ్వాస ప్రశ్వాసములుగల పురుగులై పోయినారా? మిత్రమా! చంద్రసేనా

గీ. చేరి నారము రెడ్లతోఁ బోరు సల్ప
వాహినిం గూర్చి కొంచు సంబరము మీఱ
నిపుడు రెడ్లతోఁ బోరుట కేమి గాని
తొలుత నీ మాన హీనులఁ దునుమ వలయు.

చంద్ర—మిత్రమా! నీవు త్వరపడు చున్నావు. ఇప్పుడు తొందఱపడిన లాభము లేదు సుమా! మనకు నాంధ్రతో నేమి వచ్చె? మన మిప్పుడు జాగరూకతతో నుండ వలసినది రెడ్ల విషయము. మాన హీనులగు నా యధములు మనల నేమి సేయఁగలరు?

సుబా—చెలికాఁడా! అది యట్లే. కాని

ఆ. వె. అన్య జాతి వార లహితు లౌట నిజంబె
వారిఁ గూడి నట్టి స్వకులు లధిక
వైరు; లన్య జాతి వారిఁ ద్రుంపక మున్న
స్వ కుల పాంసనులను జంప వలయు.

క్షత్రియులు సాయము సేయనిచో నీ రెడ్లు మనల నేమిసేయఁగలరు? మన వాండ్రు గలియనిచో సృష్ట్యాది నుండియు రాజ్య పాలనకు నియమితు లగు క్షత్రియుల మగు మన లోఁతు పాతులు, నిన్న గాక మొన్న రాజ్య పాలనము సేయ మొద లిడిన రెడ్ల కేమి తెలియును? ఇంటి గుట్టు

లంకకుం జేటను సామెత మఱచితివా?

(అప్పుడు రెండు బాణములు వచ్చి తాఁకుటచే సుబాహు
చంద్రసేనుల కిరీటములు పడి పోవును )

సుబా—( ఆశ్చర్య సంతాపములతో ) ఆఁ! ఏమి యీవిపరీతము!

చంద్ర—ఎవఁడురా మా కిరీటములను బడఁ గొట్టిన వాఁడు?
( ముందుకుఁ జూచి ) యువరాజు భానుమంత రెడ్డిగాఁడా? ఏమీ! ఎంత గర్వించి యున్నాఁడీ డింభకుఁడు!

చ. అరయుచు నుండ బందుగులు నవ్వయి మిత్రులు స్వీయ సైనికో
త్కరములు భానుమంతుని బ్రతాపముతో నెగురంగ నైచి భీ
కర విలయాగ్ని నీతి నిభ ఖడ్గమునన్ దెగ వేసి వేగ మ
చ్ఛిరమునఁ గ్రాల్కిరీటమును ఛేదము సేసిన సూడుఁ దీర్చెదన్.

సుబా—( తనలో ) అక్కటా! కిరీట భంగము సేయుట కన్న శిరచ్ఛేదము గావించిన బాగుండును. కదన మొక్కొక్క గడియకో రెండు గడియలకో ప్రారంభింపఁ దలఁచి యున్నారము. కాని తొలు దొల్తనే " మీ శిరముల నిట్లే నిముసములో విలాస మాత్రమున నెగురఁ గొట్టి వైచెద " నని తెలుపుటకో యన నీ భానుమంతుఁడు మా కిరీటములను బడఁ గొట్టినాఁడు. దైవ బల మిప్పుడు రెడ్లకు విశేషముగ నున్నది. మే మెట్టి వేళ నీ జైత్ర యాత్రకు బయలు వెడలితిమో గాని సంగర రంగము ప్రవేశించి నంతనే వేగులవాఁడు రెడ్లచేఁ జిక్కుటయు, మా కిరీటచ్ఛేదము సేయఁ బడుటయు నను రెండు నశుభ సూచనలైనవి. ఇఁక రెడ్లతోఁ బోరి గెలుచుట మా తరము గాదు. కావున సేను దిరిగి పోవుటయే మంచిది.

చంద్ర—మిత్రమా! ఏమో యాలోచించు చున్నట్లున్నావు?

సుబా—ఆలోచన కే మున్నది? భానుమంతుని పై వ్యర్థముగ నేల కోపించెదవు?

చంద్రి—ఏమిది? సుబాహూ!

గీ. మానయుతునకుఁ బ్రత్యక్ష మాన మరయఁ
గాఁ గిరీటమ్ము; దాని నయ్యర్భకుండు
భంగ మొనరించెఁ గ్రొవ్వి; యీ పగను దీర్ప
నా ఖలుని గూల్ప వలదె? శౌర్యమ్ము మీఱ.

సుబా—నీ యభిప్రాయము బాగుగనే యున్నది. కాని యది నెఱవేఱు టెట్లు?

చ. సహజ పరాక్రమాన్వితులు, శౌర్య నిశాంతులు మూడ రెడ్లు, దు
స్సహ మల రెడ్ల వాడి సహజమ్ముగ; నా పయి రాచవారు దు
స్సహ భుజ వీర్య భూషితులు సాయము సేయుచు నుండి రింక నే
వహిఁ బగఁ దీర్చికొందు? గెలువన్ గలమే యల రెడ్ల వీరులన్,

కావున దురభిమానము వీడి వెను దిరిగి పోవుదము రమ్ము.

చంద్రి—ఏమంటివి? రెడ్లకు వెఱచి వెను దిరిగి పోవుదమా? అక్కటా! ఎన్నఁడు నని యెఱుంగని యొక్క కొఱగాని మాట పల్కి క్షత్రియుల పౌరుష మంతయుఁ బోఁ గొట్టితివి గదా? అన్నా! ఎట్టివాని నోట నెట్టి మాట వెడలినది! ఓయీ! సుబాహూ!

క. పొడమితిమి రాచ కొలమునఁ
గడు శౌర్య భుజా బలములఁ గాంచితి; మట్టుపై,
నడి వయసున నుంటిమి భయ
పడి రిపులకుఁ జాఱి పోవ భావ్యమె మనకున్.

సుబా—భావ్యమో యభావ్యమో తరువాతఁ జూచు కొందము. [అర్థోక్తి]

గోపాలవర్మ—(ప్రవేశించి) జయము జయము క్షత్రియ కుల భూషణులారా!

సుబా—(ఉలికిపడి వెనుదిరిగి చూచి) ఎవరు? గోపాల వర్మ వేనా? ఓయీ! రెడ్లచేఁ బట్టువడితివే! మఱల నెట్లు తప్పించుకొని వచ్చితివి?

గోపా—రెడ్లచేఁ జిక్కి తప్పించుకొని వచ్చుటే?

సుబా—మఱెట్లు వచ్చితివి?

గోపా—దయ దలఁచి వదలి పెట్టుటచేత.

చంద్ర—వాండ్రు నిన్ను వదలి పెట్టిరా?

గోపా—వదలక పోవుటకు నావలన వారికి భయమేమి?

సుబా—ఔరా! రెడ్ల చెయిదములు!

చంద్ర—దీని కేమిగాని యచ్చట నేమేమి జరిగినదో యామూలాగ్రముగ నెఱింగింపుము.

గోపాల—మీచే ననుజ్ఞాతుఁడనై రెడ్ల సేనను జూడఁ బోయి యనుమానింపఁబడి వారిచేఁ బట్టుకొనఁ బడితిని.

సుబా—మాయకాఁడ వగు నిన్నే పట్టుకొనిరిగా రెడ్లు!

గోపా—రెడ్లలో నాకన్న మాయకాండ్రున్నారు.

చంద్ర—తరువాత?

గోపా—వారిచే నిర్బంధింపఁబడి యిఁక బ్రతుకుట యబద్ధమని నేను నిజమే చెప్పితిని.

సుబా—గోపాలవర్మా! క్షాత్రము నిలిపితివి! అంతియే చాలు.

చంద్ర—తరువాత?

గోపా—చక్రవర్తి యగు కామ దేవారెడ్డి నా నిజ వృత్తాంతమును విని మందహాసము గావించి యువరాజుతో నిట్లనియె.

గీ. కులముచేఁ జూడ మన కన్న గొప్ప వాఁడు
పరులకును వేగఁ దెలుపఁగ వచ్చినాఁడు
ఇతఁడు చూదిన మన కేమి యెగ్గుపుట్టు?
నంత కొంకక బలమెల్లఁ జూపి రమ్ము.

సుబా—ఏమీా రెడ్ల ధైర్యము! ఓయీా!

గీ. శత్రుపక్షమ్ము వాఁడవు సైన్యమరయ
నరిగినాఁడవు, చేఁజిక్కి నట్టివాఁడ
వట్టి నీయెడఁ గొంకింతయైన లేక
దళము గనుఁగొనఁ బంపెనే! తనయు నిచ్చి.

చంద్రి—ఓయీా! సుబాహూా! దాని కేమి యట్లుండ నిమ్ము. ఏమీా! ఎంత పోతరించి యున్నారీ రెడ్లు!

గీ. వారె శౌర్యమ్ముచే గొప్ప వారలంట
మనము కామంట, కులముచే ఘనుల మంట
వాడిచే గొప్ప వారలు వారొ మనమొ
తెల్లియుఁనిక నొక్క గడియలోఁ దెల్లముగను.

(శిరః కంపము గావించి) కానిమ్ము. గోపాల వర్మా! తరువాత నీవే మిచేసితివి?

గోపా—యువరాజుతోఁ గూడఁబోయి యశ్వబలము, కాల్బలము రథిక సంఘము, కరియూథము, ఫిరంగీలబారు మున్నగు రెడ్ల బలమంత యుఁ జూచి వచ్చితిని.

చంద్రి—వారి సైన్య మెంత?

గోపా—ఫిరంగులు నాల్గువేలకుఁ దక్కువ యుండవు. ఏఁబది వేల గుఱ్ఱపుఁ బటాలము. ఇరువది వేల యేనుఁగులు. ముప్పది వేల రథములు.

మూఁడు లక్షల కాల్బలము. మొత్తము ఫిరంగులు గాక నాల్గు లక్షల సైన్యము గలదు.

సుబా—ఏఁబది వేల కాల్బలమును, వేయి ఫిరంగులును వారికి మనకన్న నెక్కువ యుండ నేమి?

చంద్రి—మిత్రమా! మన సేన కన్న వారి సైన్య మెక్కుడని జడియకుము. ఏమన?

గీ. బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకును
జిత్తమున కెక్కు నట్లుగా సేవ లెప్పుడు
సల్ప వలసిన నాల్గవ జాతి వారు
శూరు లయ్యెద రే యెందుఁ జోద్యముగను.

గోపాలవర్మా! తరువాత నేమి జరిగినది?

గోపా—సర్వ సైన్యమును జూచిన తరువాత యువరాజు తన మాటలుగా మీతోఁ జెప్పమని సోత్సాహముగా నిట్లనియె.

మ. కన మీ వేగులవాఁడు మా బలము సాకల్యమ్ముగా; మా విభీ
షణ శౌర్యానల సౌమ్య దుస్సహత మీ చారుండె వాక్రుచ్చు; వ
చ్చిన మార్గమ్మున వేగ స్వస్థలికి వేంచేయుండు జీవింప నెం
చిన; లేదేని రణమ్ము సేయుటకు సంసిద్ధమ్ముగా నుండుఁడీ!

చంద్రి—ఈ కొండిక వాఁడు పరాక్రమలవదుర్విదగ్ధుఁడై, స్వ ప ర బల తారతమ్యము తెలుంగక కాఱు లఱచు చున్నాఁడు. పాపమీ బుడుతఁడు పోరాట మనిన నాటలను కొనియెఁ గాఁబోలు!

సుబా—(తనలో) ఆహా! చంద్రిసేనున కెంత గర్వమున్నది!

గోపా—తరువాత నాతఁడు తన యమ్ముల పొదినుండి రెండు కటకటమ్ములం దీసెను. నా దారిని నేను వచ్చుచుండఁగా రిత్రివిష్వ వెనే ధన్వ

ని నా చెవులు గింగురు వోఁగొట్టెను. కాని బాణము లెటు వోయినవో రెఱుఁగ.

సుబా—(తనలో)తిన్నఁగవచ్చి మాకు శృంగభంగముగావించినవి.

చంద్ర—కానిమ్ము. (ముందుకుఁ జూచి) ఆఁ! అప్పుడే రెడ్లు సేనా విన్యాసముఁ గావించుచున్నారు! గోపాలా! నీవు పోయి మన సేనను గూడ బారులు దీర్చి నిలుపు నట్లు సర్వ సేనానియగు మానపాలునితోఁ జెప్పుము. త్వరగఁ బొమ్ము.

గోపా—చిత్తము. (అని నిష్క్రమించును)

సుబా—చంద్రసేనా! ఇప్పుడైనను వెను దీయవా?

చంద్ర—సుబాహూ! నీకు మతిలేదా?

సుబా—చంద్రసేనా! గర్వింపకుము. మనమెంత?

క. వింటిగద వివరముగా
నొంటని వారల ప్రతాప మౌర్వ నశక్య
మ్మంట! ప్రగల్భము లాడెదు
గెంటు వడక రెడ్ల నీవు గెలువం గలవే?

చంద్ర—ఏమిది? సుబాహూ!

మ. అనఘమ్మై తగు క్షత్రి యాన్వయమునం దావిర్భవమ్మంది, నె
మ్మన మం దాహవ మన్న భీతిఁ గన సంభావ్యమ్మె? భూమించిరె
డ్లన నాకాశమునుండి యూడి పడిరే? యుక్తిగఁగా; ఖేట రా
ట్కనదా భీల కరాసిచే నడరి రెడ్లం ద్రుంతు నే నింతలో.

సుబా—మాటలు సెప్పవచ్చు. అందఱు యోధాన యోధులు గల రెడ్లసైన్యమును మనము జయింపఁగలమా?

చంద్ర—జ యాపజయము లొక్కరివి గావు. అవి దైవాధీనము లు. రెడ్లందఱో యున్నారని నీవు జంకకుము.

సీ. జలధిలో నవలీలఁ జరియించు నోడ నిం
తనె ముంపఁ జిన్ని రంధ్రమ్మె చాలు
శైల సమ్మితమైన తూల రాశిని గాల్ప
నలుసంత యగ్ని కణమ్మెచాలుఁ
గడవంత గుమ్మడి కాయ ముక్కలు గాఁగ
వెసఁ జేయఁ జిన కత్తి పీఁట చాలు
బహుళ సత్కీర్తి విధ్వంసమ్ముగా నొన
ర్పఁగ నొక్క దుష్ప్రవర్తనమె చాలుఁ
గీ. పెక్కు అతి కష్టమునఁ గూడఁ బెట్టి నట్టి
కాసు నంత వెచ్చింప నొక్కండె చాలు
నా విధముగా నగణ్యమైనట్టి రెడ్ల
సేనఁ బరిమార్ప మన చిన్ని సేన చాలు.

సుబా—మిత్ర సత్తమా! నీ వెన్ని చెప్పినను మన మా రెడ్లతోఁ బోరి గెలుచుట కష్టము.

ఆ. వె. పర్వతములుపట్టి బంతులాడఁగ వచ్చుఁ
జలధి నీఁది చెంతఁ జేర వచ్చుఁ
గాల కూట రసము గబళింపఁగా వచ్చు
నాజి రెడ్ల గెలువ నగునె మనకు?.

కావున నిఁక మారు పల్కక వెను దిరిగి పోదము రమ్మా.

చంద్రి—(తనలో) విశాల మగు రెడ్ల సేనా సాగరముఁ గాంచుటచే నీతని యొడలు కంప మెత్తు చున్నది. ఈతనిం బ్రోత్సహించి యిటకుఁ దోడ్కొని వచ్చు నప్పటికే మిగులఁ గష్టమైనది. ఇంత వఱకును వచ్చి యీతఁడు వెనుకకుఁ బాఱి పోవునట్లు తోఁచు చున్నది. ఇఁక నొక్క మాట చెప్పెద. యుద్ధముఁ జేసినఁ జేయును. లేకున్న నాకర వాలమున

కిర జేసి వైచెన. పౌరుష శూన్యులు చచ్చి నను బ్రతికి నను నొక్కటే.
(ప్రకాశముగా) ఓయీ! సుబాహూ!

గీ. శత్రు సేనలఁ గాంచి యీ చంద మగను
బాఱి పోవఁగఁ జూచెడి వాఁడ వీవు
తగుదు నమ్మా యటంచు యుద్ధమున కేట్లు
వచ్చి నాఁడవు? దురము పైఁబైనిఁ గలదె?

అదియుఁగాక, ఓయీ పరనిందా పరాయణా! సీతమ్మఁడు విషయస
ఖా సక్తుఁడనియు రెడ్లతోఁ గలిసిన బృహన్నల భీమ కర్ణాదులు మానా
భి మానములు లేని వారనియు నిందించితివే. శత్రు సేనలం గాంచి పాఱి
పోవు నీకు మానాభి మానములున్నవా? నీవు సుక్షత్రియ వంశమునఁ బు
ట్టితివా?

సుబా—ఏమీ? నేను మానాభి మానములు లేని వాఁడనా?

చంద్ర—కాకున్న నిప్పు డీ శ్లోల బెదరెదవు?

సుబా—కానిమ్ము. చంద్రసేనా! నన్నంత పరాక్రమ హీనుఁడు
గాఁ దలంచితివి! విశేష సైన్యము గల రెడ్ల తోఁ బోరిన సైన్యము నాశన
మగును, ధనము వ్యర్థముగ నమ్మయి పోవునని జంకితిని గాని నేను సం
గ్రామ రంగమున నిలిచితి నేని రెడ్లకుఁగాదు, నీకుఁ గాదు బ్రహ్మకైన న
న్ను గెలువఁ దర మగునా!

శా. రానే వచ్చితి యుద్ధముల్ సలుప రెడ్లం బాఱి; భీకింగనం
గానేలా?; యిఁక జీవితమ్ము పయిఁ గాంక్షల్ రోసి, యాశత్రురా
ట్సేనా వారిధిఁ జొచ్చి మందరముమాడ్కిన్, స్వేచ్ఛ మిట్టాడి, హా
హా నిర్ఘోషము లుప్పతిల్ల నిజ శౌర్యమ్ముల్ వెలింగించెదన్.

చంద్ర—వహవా! సుబాహూ! అదియే పౌరుషము! ఈ శరీరము
నుస్థిర మైనది గాదు. చావున కిన్ని చావులు లేవు, జయా పజయములు

దైవా ధీనములు. యుద్ధములో జయించిన ననంత యశము చేకూఱును. నిహతుఁ డైనచో నక్షయ వీర స్వర్గమున విహరింప వచ్చును. క్షత్రియుల కిది పరమ ధర్మము. సుక్షత్రియ వంశ సం జనితుల మగు మన మిరువురము మొక్క వోని ధైర్యముతో రణ రంగమున నిలిచిన భూమంచి రెడ్లెంత?

సేవ—(ప్రవేశించి) దేవా! రెడ్ల స్కంధా వారము నుండి యొక యోధుఁడు వచ్చి మీ చెంతకు రాఁగోరు చున్నాఁడు.

సుబా—త్వరగఁ బ్రవేశ పెట్టుము.

సేవ—చిత్తము.(అనినిష్క్రమించుచున్నాఁడు)

చంద్రి—(ముందుకుఁ జూచి) అదిగో నీలకంఠా రెడ్డి వచ్చు చున్నాఁడు; మిత్రమా! నీవిప్పట్టున శాంతము వహింప వలెను.

(అప్పుడు రాయబారి నీలకంఠా రెడ్డి ప్రవేశించుచున్నాఁడు)

నీల—(తనలో) సార్వభౌముఁ డాదర పూర్వకముగ నన్నుఁ జేరఁ బిలిచి « వత్సా! నీలకంఠారెడ్డీ! క్షత్రియులకును మనకు నిప్పుడు దారుణ సంగ్రామము గానున్నది. రాచవా రక్రమముగ యుద్ధమునకు సిద్ధ పడినారు. అందుచే నిప్పుడు గొప్ప ముప్పు వాటిల్లనున్నది. శక్తి కొలందిగఁ బ్రజలకు సౌఖ్య మొనగూర్చుట రాజధర్మము. కావున సాధ్యమైనంతవఱకీ సంగ్రామము కాకుండ నెవరి దేశములకు వారు వోవు నట్లు సంధి చేసి రావలసిన » దని రాయబారిగా నన్ను నియమించెను. ఇందును వారంగీకరింపరే నెంత మాత్రమును జంకక రెడ్ల శౌర్యమును జూపి కయ్యము గలిపి రమ్మని గూడ నాన తిచ్చెను. ఆలోచించి చూడ నీ తుది మాటయే నెఱవేఱు నట్లు తోఁచు చున్నది. ఏమున? అశక్తి దుర్జనులై యన్యాయమ యుద్ధమునకు సిద్ధపడిన క్షత్రియులు సంధికి సమ్మతింతు ! అయినను సార్వభౌముని యాదేశము చెల్లింపవలయును. నాలోటు లేకుండ

సంధి సేయుటకుఁ బ్రయత్నించెను. యత్నమొనరించి నప్పుడు సిద్ధింపక పోయినచో నందుఁ దప్పేమున్నది? (ముందుకుఁ జూచి) అదిగో సుబాహు చంద్రసేను లచ్చట నున్నారు. భానుమంతుఁడు కిరీటములను బడఁ గొట్టుటచే వా రిప్పుడు తోఁకఁ ద్రొక్కిన త్రాఁచులవలె నుందురు. అయిన ను నా కేమి భయము? (అని సుబాహు చంద్రసేనులను సమీపించును)

చంద్ర—అయ్యా! కూర్చుండుఁడు. (అందఱును గూరుచుందురు)

సుబా—అయ్యా! జాలమేల? మీరు వచ్చినపని యేమో సెలవిండు.

నీల—అయ్యా! మహా దారుణ సంగ్రామము సేయ సేనావిన్యాసము గావించుకొని సర్వ సిద్ధముగ నున్న మన కికఁ వేఱె పని యేమున్నది? చిత్తగింపుఁడు.

చంద్ర—అవహితులమై యున్నారము.

నీల—

సీ. సామంత మకుట రత్నామల దివ్య ప్ర
భా విరాజ న్మృదు పాదయుగుఁడు
ప్రబల శత్రు క్షమావర కంఠ లుంఠ నో
జ్జ్వల ఖడ్గ భాస్వత్ప్రశస్త కరుఁడు
ఆత్మ ప్రజా సుఖార్థాప్త్యమానేతర
భూవర దుర్లభ జీవితుండు
శరదభ్ర నీహార శారద చంద్రి కో
జ్జ్వల యశో ధవళి తాశాముఖుండు

గీ. సుగుణ రత్నాకరుఁడు, మహా శూరవరుఁడు,
సదయ హృదయుండు, సరసుండు, సార్వభౌముఁ
డైన రామ దేవా రెడ్డి యనుప, రాయ
బార మిచ్చట నడుపఁగ వచ్చినాఁడ.

సుబా—(తనలో) చక్రవర్తిని బట్టువలె నెట్లు పొగడు చున్నాడు!

చంద్రి—సరే. మీప్రభువు నానతి నెఱవేర్చు కొనుఁడు.

నీల—(తనలో) ఏమి త్రాగతనముగా మాట్లాడు చున్నాఁడు! మా ప్రభువఁట తమకుఁ బ్రభువు కాఁడా? పాప మీ క్షత్రియు లిల్లలికి నంతనే సంతుష్ట మైనదను కొనుచున్నారు! (ప్రకాశముగా) మీరును మేమును మిత్రులము. రెడ్లకును క్షత్రియులకును నీ స్నేహము చాల గాలము నుండి యున్నది. ఇంత వఱకును మనము పరస్పర గౌరవ భావ ములతోఁ బ్రవర్తించు చున్నారము. మీరు మా సామంతులై యుండియుఁ గప్పం బీయకున్నను నింత వఱకు సత్సభ సంచారులై యుండుటచే మా కొలువున నగ్రస్థానం బొసంగు చున్నారము. అట్టి యెడ మీరిప్పు డిట్లు మాపై నెత్తి వచ్చుట న్యాయము గాదు.

గీ. బాధ సేయఁగ లేదు కప్పమ్ము కొఱకు
రేఁగి మర్యాద తప్పి చరింప లేదు
ఇంతయును గారణము లేక యీర్ష్య కలిమి
నిట్లు పోరాడఁగాఁగ మీకేటి తగవు?

చంద్రి—పరాక్రమ వంతు లగు నరపాలురకుఁ బర రాజుల తోఁ బోరాడఁగారణము లేందులకు? అదియుఁగాక, నిష్కారణముగ మేము యుద్ధమునకు సిద్ధపడి యుండ లేదు. శూర శిఖామణులగు నర పాలకులకుఁ బరులతో యుద్ధము సేయ రాజ్యసంపాదనమును, సద్యశస్సముపార్జనమును గారణములు గావా? అది యట్లుండ, రాజ శబ్దము క్షత్రియ జాత్యైక రూఢము. అది యిప్పుడు కాల వైపరీత్యముచే క్షత్రియేతర జాతికిఁ గూడఁ జెల్లుచున్నది. ఇది యధర్మము. ఈ యధర్మమును నిర్మూలముఁ గావించుట సమర్థులగు క్షత్రియులకు విధి. కావున మేమిప్పుడు క్షత్రియేతర జాతి

వారికి ధరా పాలకత్వము లేకుండఁ జేయఁ బూని నారము. మే మిప్పుడు సంగ్రామము సేయు రా ముఖ్య కారణ మిది.

నీల—అబ్బా! మీ యూహ లెంత యుదారము లయి యున్నవి! క్షత్రియేతర జాతి వారికి ధరా పాలకత్వము లేకుండఁ జేయఁ బ్రయత్నించు చున్నారుగా ? ఈ విషయ మై మీ కన్నిగు పోవలసినదే కాని యెంత మాత్రమును మీరు కృతార్థులు కాఁజాలరు. ఇప్పుడు గాదు. వేయేండ్లు వారాంబు పర్ణాశనులై తల క్రిందుగఁ దపము గావించినను మీ రేమియుఁ జేయఁజాలరు. మీ ప్రతాపము లను సాగ నిచ్చుటకు క్షత్రియు లింక నిస్తేజులై యుండ లేదు. అంతయు నేటికి? మీరు పోర నిశ్చ యించు కొంటి రేని మా నిశ్చయమును వినుఁడు.

చంద్ర—అదేదో తెల్పుఁడు.

నీల—వినుఁడు.

గీ. అక్రమపు యుద్ధములను జేయంగ రాదు
న్యాయ యుద్ధమ్ములకు వెను దీయఁ బోము
న్యాయమును వీడి మీరలు చేయుచున్న
సమర సన్నాహ మింతయు సాగనీము.

సుబా—ఏమీ? మా సమర సన్నాహ ములను సాగనీయ నంతటి శక్తి కలదుగా మీకు?

నీల—మీ రెంత? గర్వింపకుఁడు ; అనేకంగ బలములతో మే మిప్పుడు పోరాడ సంసిద్ధుల మై యున్నారము. పోరినచో మీరు దేశము న శోకగతికి రప్పించిన వా రగుదురు. మాకు నష్టమును, బ్రజలకుఁ గష్టమును గల్గించిన వా రగుదురు. మీరు చెడి పోయిన వారగుదురు. యోచించు కొనుఁడు. మా మాటయు, దేశము విషయమును, బ్రజల విషయమును గూడ నల్లుంపుఁడు. తనకు మాలిన ధర్మము లేదు, నిర్హేతుక మగు మీ

నాశనమైనను దలంచుకొని మర్యాదతోఁ దరలి పొండు.

సుబా—ఏమీ? మిన్ను మన్ను గానక కాఁకులు ప్రేలుచున్నాఁడవు?

చంద్రి—తరలి పోకున్న?—

నీల—తరలి పోవెదరో బ్రతికెదరో? పోకున్న నేమున్నది?

మ. అసమంబై విలయప్రచండ దహనోద్యత్తీక్ష్ణ ధారా శిఖా
విసరంబై తురగాంఘ్రి ఘట్ట జనితోద్వేలస్ఫులింగమ్ములై
యసమాగ్న్యాయుధఘాఘుమారవయుతంబౌ రెస్లసచ్ఛ్రాయముల్
లసదగ్నిం బడి మ్రగ్గి పోదు రిఁక నేలా సందియమ్మందఁగన్.

చంద్రి—ఏమీ? పరాక్రమైకధనులగు క్షత్రియులు నీకంత శౌర్య విహీనులుగాఁ గన్పడుచుండిరిగా?

చ. భ్రమసితి వేమొ క్షత్రియులు పౌరుష హీనులటంచు; మా పరా
క్రమము నెఱుంగవీవు బలగర్వమునన్ వదరంగ జొచ్చి త
య్యమరులు గూడ భీతిలెడ రాహవమం జెదరింప మమ్ములన్
నిముసము లోన గెల్చెదము నిక్కము రెప్పెన మాకు లెక్కయే?

సుబా—ఓ యాత్మశ్లాఘా పరాయణా! క్షత్రియుల శౌర్యాగ్ని యెంత దుస్సహమైనదో నీ వెఱుంగవు. వినుము. (అర్ధోక్తి)

నీల—ఎఱుంగ కేమి? క్షత్రియుల శౌర్యాగ్ని పరశురాముని కాలము నందే చల్లారి పోయినది గాదా? చెప్పనక్కఱ లేదు.

సుబా—ఏమీ! నీకింత కావరము!

క. విలయ ప్రచండ దహనో
జ్జ్వాలభీకర మైన నాదు చండతరాసిన్
దులువా! నిముసములో నీ
తలఁ ద్రుంచెదఁ జూడు నా ప్రతాపము వెలుఁగన్.

నీల--ఆఁ! చెప్పవచ్చు, కొట్టుటకు గుప్పపిట్టగాను. నేను రెడ్డి పిన్నఁడను.

చంద్ర--(వెనుకకుఁజూచి) జయంతా! ఈతులువను బట్టుకొనుము.

(తెరలో) ఇదేవచ్చుచున్నాఁడ.

నీల--(తనలో) రాయబార మిట్లు పరిణమించినది. ఈ తుచ్ఛులు నన్నుఁ బట్టుకొనఁ జూచు చున్నారు. ఇఁకఁజూచు చుండిన లాభములేదు. కత్తిదూసి పైఁ బడెద, మీఁద దైవ మున్నాఁడు.(ప్రకాశముగా) ఓరోరీ! దురాత్ములారా! నన్ను గట్టవచ్చెదరుగా! రండు.

(అని మీఁదఁ బడుచున్నాఁడు)

(అందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము.

శ్రీ ర స్తు.

# రా మ దే వ వి జ య ము.

## తృ తీ యాం క ము.



[ యు ద్ధ భూ మి. ]



(రామదేవారెడ్డి, ధర్మారెడ్డి, భానుమంతరెడ్డి, హేమకూటారెడ్డి ప్రవేశించుచున్నారు)

రామ—హేమకూటారెడ్డీ! మన సేనావిన్యాసముగావించితివా?

హేమ—చిత్తము. చేసినేను యిట్లు వచ్చితిని.

రామ—సరే. ఎచ్చటెచ్చట నేయే సేనాంగముల సమర్చితివి?

హేమ—దేవా! చిత్తగింపుడు. రెండు కొనల యందును ముప్పది వేల గుఱ్ఱపు బలము, దాని వెనుక నెనిమిది వేల యేనుఁగులును, నడుమ మూఁడు లక్షల కాల్బలమును, దాని వెనుక రహస్యముగ రెండు వేల ఫిరంగీల బారును నమర్చి యిట్లు సూచీవ్యూహమును బన్నితిని. వలయు నెడల దక్షిణము ప్రత్యక్షమగు నట్లు మూఁడు వేల గుఱ్ఱపు రౌతులను, రెండు వేల యేనుఁగులను, నాల్గువేల రథములను సిద్ధము చేసి యుంచితిని మహాప్రభూ!

రామ—బాగుగాఁ జేసితివి. నీ వెచ్చట నుండెదవు?

హేమ—దేవా! మృత్యుంజయ రెడ్డియు నేనును నశ్వారూఢుల మై వ్యూహాగ్రముల యందుండుదుము.

రామ—బాగున్నది.

హేమ—మూఁడు లక్షల పదాతి సైన్యమునకు గంగాధరరెడ్డి మున్నగు నెనమండ్రు రెడ్డి వీరులను క్షత్రియులను నల్గురను సహాయ నాయకులుగ నియమించితిని. వారిపై నీలకంఠారెడ్డిని సర్వాధికారిగాఁ జేసితిని.

రామ—బాగు బాగు.

హేమ—ఏనుఁగు దళముపై సర్వాధికారమును వహింప ధర్మారెడ్డిని కోరఁ దలఁచి యున్నాఁడను మహాప్రభూ!

ధర్మా—సేనాధిపా! నన్ను గోరనేల? నియమింపరాదా? మనలో మన కట్టి పట్టింపుల లేమున్నవి?

హేమ—ఆర్యా! నియమించుటకు నే నెంతటి వాఁడను? భృత్యుని యందంత మాత్రము దయయుంచి రదియ చాలును.

రామ—సేనాధిపా! భృత్యుఁడ ననుచున్నా వేమిటి? మనలో మన కట్టి భేద భావము లెప్పుడు నుండఁగూడదు. సర్వేశ్వరునకును మన దేశ ప్రజలకును మన మెల్లఱము భృత్యులమే.

హేమ—నా యందును, ప్రజల యందును దమకుఁ గల యనురాగ మనంతము. మహాప్రభూ! నేఁడు దేవరవారు సర్వ సేనాధిపత్యమును స్వీకరింప వలెను.

రామ—నేఁ డిట్లు చేసితి వేమి? నీ వేల తప్పుకొనవలెను?

హేమ—దేవా! నేఁడు సూచీ వ్యూహముచే క్షత్రియుల సరికట్ట నుత్సాహము కలిగినది, నే నశ్వారూఢుఁడనై ముందుండవలెను గదా! అదియుఁగాక,—దేవరవా రుండఁగా సమర రంగమున సర్వ సేనాధిపత్యమును వహించుట నాకు భారముగా నున్నది.

రామ—అదేమి? నీ వెప్పుడు నట్లు తలంపకుము. విశ్వసనీయులును, సమర్థులు నగు యోధు లుండఁగా మహారాజునకు సర్వ సేనాధిపత్యము వహింపవలసిన యవసర మేమున్నది? నీ వసహాయ శూరుఁడవు,

అదియుఁగాక, మన మందఱి యొక్క జాతిహారము మన కేమిభేద మున్నది?

హేమ——నేనును గక్కిన సేనానులును గూడ దేవర వారి స్వ సేనాధిపత్యము క్రిందఁ బోరాడ ముచ్చట పడుచున్నారము మహాప్రభూ!

రామ——అట్లయిన నే ననుగ్రహించితిని లే.

హేమ——అనుగ్రహింపఁబడితిని.

భాను——హేమకూటారెడ్డీ! న సైనికిని నియమించితివి కావేమి? నేను పరాక్రమ హీనుఁడ ననుకొంటివా?

హేమ——అయ్యో! మీరు పరాక్రమ హీనులెట్లయ్యెదరు?

గీ. అయిదు నాళ్ళల నుండి యత్యద్భుతముగ
రాచవీరులఁ బ్రబలసంగ్రామ సీమ
మట్టుపెట్టుచు నున్నార లట్టి యెడల
నరయఁ బౌరుష హీను లెట్లగుదు రీరు?

క్షమింపుఁడు. నేఁడు సార్వభౌముఁడు నా యెడలఁ గనఁబఱచిన దయ కుప్పొంగి పోయి మీ విషయమును జెప్పుట విస్మరించితిని.

రామ——సేనాధిపా! చిరంజీవి నే యధికారమున నియమించితివి?

హేమ——దేవా! ఫిరంగీల వారు పయి నియమించితిని.

భాను——నా కా యధికార మక్కఱలేదు.

రామ——కుమారా! కారణమేమి?

భాను——తండ్రీ!

గీ. తెలుపనేల? ఫిరంగి వారలు రహస్య
వృత్తిఁ గాల్బలమునకును వెనుకనుండె
వీరవర్యుఁడ నేనేల వెనుక నుందు
పౌరుషమె యది నావంటి బంటులకును?

నాకు యుద్ధరంగమనిన భయమా? క్షత్రియులతోఁ బోరఁజాలనా? ఈ

యాశ్వికబలము, నీపదాతిసంఘము, నీరథికవ్రజము, నీకరియూథము, నీ ఫిరంగీలబారు, నీయోధసహస్రము, నంతయునేల! మీరందఱు నీచతురంగ బలముతో వెనుక నుండుఁడు.

మ. ప్రథితాస్మద్దృఢబాహువిక్రమ కథా ప్రావీణ్య మేపారఁగాఁ
బ్రథనక్షోణి తలమ్మునన్ రహి విహార మ్మోను గావింతు న
స్మద్ఘనాహాస్య నిపాత మాత్రమున భీమ ప్రక్రియన్ నిర్మలాం
బుధి ఘూర్ణిల్లెడుపోల్కి క్షత్రియబలాంభో రాశి ఘూర్ణిల్లఁగన్.

రామ—కుమారా! నీ వట్టి వీరుఁడవే.

భాను—జనకా! మీరు చేయునది స్తుతియా? నిందయా?

గీ. ప్రస్తుతి యొనర్చెదరు వీర వరుఁడవంచు
వెనుక నుండుమటందురు భీరునట్లు
వెనుక నుండెడి వాఁడెట్లు వీరుఁడగును
బోరనిఁ బరువిడు పాఱు బోతు గాక.

రామ—వెఱ్ఱివాఁడా! నీకెట్టి సందియము వొడమెను!

సీ. బలము దన్ననుసరింపఁగ వైరి వీరులతోఁ
బోరాడుచు నొకప్డు ముందు నుండు
బలము నిర్భయ వృత్తి బవరంబు సేయుచోఁ
బరికించుచు నొకప్డు ప్రక్క నుండు
వెనుదీయు నున్న వాహినిని బ్రోత్సాహంబు
నొనరించుచు నొకప్డు వెనుక నుండు
వైరి సేనను మాయఁ బడఁ ద్రోయ భీరుని
తీరున నొక్కప్డు పాఱిపోవు

గీ. ఆత్మ సైన్య పరీక్షార్థ మట్టి దవుడు
ప్రక్కలను, ముందు, వెన్క, నభ్యంతరమున

సంచరించుచు నుండుఁ బ్రచ్ఛన్న వృత్తి
వీర వరుఁ డంత మాత్రాన భీరుఁ డగునె?

భాను—ఏమైనను నాకా యుద్యోగ మక్కఱ లేదు.

హేమ—యువరాజా! మీ రట్లనిన నే నేమి సేయఁ గలను?

భాను—నీవు సేయలేని దేమున్నది? అంతయు నీ స్వాధీనమే.

హేమ—మీ దయ యున్నంత వఱకు నట్లే.

భాను—అయ్యో! మా దయ యెంతటిది! మే మెంతటివారము! మేము వెనుక నుండఁ దగిన వారము గదా!

రామ—కుమారా! పోనిమ్ము. నే నా ఫిరంగీల బారును నడిపించెద; నీవు సర్వ సేనాధిపత్యమును స్వీకరింపుము.

భాను—మీ రట్లు కోపించిన నే నేమి సేయఁ గలను?

రామ—ఏమీ? తనయా! నేను కోపించితినా?

భాను—జనకా!

ఆ. వె. మనవిఁ జేసి కొంటి వెనుక నుండఁగఁ జాల
నంచు విషయ వృత్తి నంత మాత్ర
నెల్ల సేవలకును నేలిక వగు మంచు
ననఁగఁ గోప మంది నటుల గాదె?

కావున, మీరు పూజ్యులు. పితృాజ్ఞా నిరసనము ఘోర పాప కృత్యము. అదియుఁగాక, నేనే పొరపడితిని. ఫిరంగీలబారు రహస్యముగఁ గాల్బలమునకు వెనుక నుండుట ధర్మ బాహ్యము గాదు. అది వ్యూహ నిర్మాణ కౌశల ప్రకాశకము. తండ్రీ!

గీ. ఎంతయును భక్తి శిరసా వహించి మీరు
నానతి ఫిరంగి బారుల కధిపుఁడ నయి
దురమునఁ రాచ వారల శిరము లెల్లఁ

బుడమి రాల్చెం గొబ్బురి ప్రొబ్బె లట్లు.

హేమ—నా మనసు కుదుటం బడినది.

రామ—పుత్రకా! ఎచ్చట నున్నను వీరున కరి మర్దనము విధి కృత్యము. క్షత్రియుల నరి కట్టి నప్పుడు హేమకూట రెడ్డి, మృత్యుంజయ రెడ్డి, ధర్మారెడ్డి, నీలకంఠారెడ్డి మున్నగు మన వీరాధివీరులెల్లను సేనా మధ్యమున నుందురు. జాగరూకతతో వారిని గనిపెట్టి ఫిరంగుల ను బేల్చుట కనుజ్ఞ యిమ్మా. సేనాధిపా! ఇట్టి వాగులు సంకుల సమర ము గావించు నపుడెవ రెచ్చట నున్నదియు వెనుక నున్న వారు తెలిసి కొనుట కష్టము. కావున నీవు ముందుండ వలసిన వాఁడవగుటచే క్ష త్రియులు మన వ్యూహ మధ్యమునఁ జిక్కికొని నపుడు ఫిరంగి గుండ్లు, పాల్పడకుండ మన వారు తప్పుకొనుటకును, ఫిరంగులఁ బేల్చుట కను జ్ఞనీయ భానుమంత రెడ్డికిఁ దెలియుటకును నేదేని నొక సంకేతము నేర్ప రుపుము.

హేమ—దేవా! యువరాజా! రాచవారు వ్యూహ మధ్యమునఁ జిక్కి నపుడేను శంఖ ధ్వనిఁ గావించెద.

రామ—నీ యూహ చక్కఁగా నున్నది. తనయా! ఏమరి యుం డకుమా. సేనాధిపా! ఈ సంకేతమును మన యోధుల కెల్లను కెఱిం గించి రమ్ము.

హేమ—చిత్తము. (అని నిష్క్రమించును)

రామ—తమ్ముఁడా! ధర్మారెడ్డీ! రాచవారితోఁ బోరఁ గడంగినది. మొదలు మొదలైన దినములలో మన సేన యెంత గతించినది?

ధర్మా—అన్నా! మన సేన పదునాలుగు వేలు మాత్రము గతిం చినది. క్షత్రియుల ఫిరంగులు రెండు వందలును, మూఁడు వేల కత్తులును మన స్వాధీనమైనవి. పదు వేల క్షత్రియ పదాతి బలము

మన కారాగారమున నున్నది. రాచవా రరువది వేల సేనను గోల్పో యి రని తెలియ వచ్చినది.

రామ---మన సేన పదాఱు వేలును, వారి సేన యరువది వేలును గతించినదా? అన్నా! ఈ క్షత్రియు లెంత పాప కృత్యమునకొడిఁ గట్టిరి!

ధర్మా---కానిండు, ఈ యుద్ధము మన లాభము కొఱకే సంభ వించినది.

ఆ. వె. ఇంత వఱకు శౌర్య హీనులు రెడ్లంచుఁ
గొంత మంది తలఁచు చునుచు నుండ్రి
మనము పోరి గెల్వఁగను వారి దుర్బుద్ధి
తొలఁగు, మన యశమ్ము వెలుఁగు జగతి.

భాను---ఆ మాట ముమ్మాటికి సత్యము. ఏమన?

చ. అనయము రెడ్ల కల్మిఁ గనులారఁ గనుంగొన లేక యీసుచే
మనమునఁ గుందుచుం దగవు మాలిన వర్తన సేయు చుంతకొం
కని యభిమాన హీనులగు క్షత్రియ వీరుల నాహవమ్మునం
దునిమి, యఖండ సౌఖ్యములతోఁ దులతూఁగఁగవచ్చు నెంతయుం.

రామ---ఔను. ఈ మీ యూహలు బాగుగ నున్నవి.

( తెరలో ) ఓ రెడ్డి వీరులారా!

గీ. రణము నొనరించు పట్టున రాచవారు
వ్యూహ మధ్యమ్ము నం జిక్కి యున్న యప్పు
డడరి నేశంఖ మూఁదెద నపుడు మీరు
తొలఁగుఁడీ ప్రక్కలకు మధ్య నిలువ కుండ.

రామ---(ముందుకుఁ జూచి) క్షత్రియులు సైత మప్పుడే సేనా వి న్యాసము గావించి సిద్ధముగ నున్నారు.

( అప్పుడు హేమకుంటారెడ్డి ప్రవేశించుచున్నాఁడు )

హేమ—దేవా!

గీ. ఉభయ చతురంగ బలములు యుద్ధ భూమిఁ
యంత నన్యోన్య జయ కాంక్ష నలరు చుండెఁ
బ్రాచ్య గిరి నుద్భవించె నా భాస్కరుండు
ఆల మొనరింప మొన లిడ నేల తడవు?

రామ—ఏమీ? సూర్యోదయ మైనదా? కానిమ్ము. సేనాధిపా తమ్ముఁడా! ఇఁక మీ మీ స్థానంబులకుఁ బోయి సిద్ధముగ నుండుఁడు.

ధర్మా, హేమ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నారు)

రామ—తనయా! నీవు మెలఁకువతో నుండ వలెను సుమా.

భాను—చిత్తము. నా లోటు లేకుండ నీ దారుణ సంగ్రామమును వేయి కన్నులఁ జూచుచుఁ దక్షుఁడై యెప్పుడు నా పనిఁ జేసెద.

రామ—మంచిది. (ముందుకుఁ జూచి) ఓ, వీర వరులారా!

మ. విలయాంభోధర వాపహాసి నినదా భీలంబు, ప్రత్యర్థి భూ
తల నాథ ప్రవర శ్రవఃపుట భిదా దక్షంబు, యుద్ధావనీ
తల సంచార పర స్వవీర నిచ యోత్సాహ ప్రదంబుగా, మహో
ద్విలస ద్రెడ్డి యశః ప్రవర్థకమునౌ భేరిని మ్రోయింపుఁడీ.

( తెరలో భేరీ ధ్వని యగుచున్నది )

భాను—(చూచి) ఆహా!

శా. భేరీ రావము మిన్ను ముట్టఁగ నె యుద్వేల ప్రమోదమ్మునన్
బారావారము గట్టు దాఁటి పటు శుంభ ద్ధ్వాన మేపార గం
భీర ప్రక్రియ నేగు మాడ్కి నసుహృ ద్వీరాళి నుగ్గాడఁగా
నారాతి వాహిని మేఁగు చుండె మది నత్యాశ్చర్య మేపారఁగన్.

(తెరలో మరల భేరీ ధ్వని యగుచున్నది. కలకలానంతరము)

రామ—క్షత్రియుల సేన గూడఁ గదలినది. ఆహా! మన గుఱ్ఱపు బల మెంత మనోహరముగ నడచుచున్నది!

గీ. చంగు చంగున దాఁటుచు సంతసమునఁ
గొమరు మీఱంగ దల లూఁపు కొనుచు, వైరి
వీరులకు సూటిగా నేగు వారువముల
గన్నన మరయంగ మోదమ్ము గలుగుచుండె.

భాను—ఇరువాఁగులు మహా సాగరమ్ముల తెఱఁగునఁ బరస్పర జయ కాంక్షచే డీకొని సంకుల సమరము నారంభించినవి. ఆహా! ఒక్క నిముసమ్మునకుఁ దొల్లి నిశ్చలమ్ములై యున్న యీ మహా సేనా సాగరము లింతలో సంక్షుభితములై పోయినవి!

రామ—(చూచి) గంభీ రాట్టహాసములతోఁ జంద్రసేనుఁడు తన గుఱ్ఱమును హేమకూటారెడ్డి పై కుఱికించినాఁడు! హేమకూటారెడ్డి దుస్సహ క్రోధాగ్ని కీలా కరాళ వదనుఁడై యెట్లు పోరాడుచున్నాఁడో!

భాను—(చూచి) అద్దిరా హేమకూటారెడ్డి పరాక్రమము! హేమకూటారెడ్డి చంద్రసేనునిపై బల్లెము విసరినాఁడు. అయ్యో! బల్లెము ముక్కలై పోయినది. (పరిక్రమించి చూచి) వహవా! సేనాధిపతి రాచవానిపైఁ దన ప్రచండ దీర్ఘ కరవాలమును విసరినాఁడు. అరరే! చంద్రసేనుని కరవాలము తుత్తునియలై పోయినది. సేనాధిపతి నిరాయుధుఁడగు చంద్రసేనుని సంహరించి వేయు నేమో కదా!

రామ—కుమారా! ఆతఁడట్టి యధర్మ ప్రవర్తన మేల గావించును?

(తెరలో) ఓయీ! క్షత్రియుఁడా!

గీ. చెలఁగి నన్ను బెండాడ వచ్చితివి గాని
నీ యడిద మంత ముక్కలై పోయెఁ గాన

బోగు టెంకెల్లు! పో పొమ్ము; పోవ వేని
రమ్ము ఖడ్గమ్ము బట్టి శౌర్యమ్ము మీఱ.

రామ—వహవా! సేనాధిపా! రెడ్డి నీమనకుఁ దగినట్లు పల్కితివి!

( తెరలోఁ గలకలా సంతరము )

భాను—ఏమి యీ కలకలము? (చూచి) అన్నా! దురాత్ము లే డ్వురు నొక్క సారి నీలకంఠా రెడ్డిపైఁ బడిరిగా!

రామ—ఏమీ? నీలకంఠా రెడ్డిపై నేడ్వు రొక్క సారి పడిరా? (చూచి) ఛీ ఛీ! క్షత్రియు లెంత ధర్మ బాహ్య ప్రవర్తనము గావించుచు న్నారు! వహవా! ఇద్దరు కూలినారు! (ముజలఁ జూచి) అన్నా! దురాత్ము లంద ఱొక్క సారి నీలకంఠా రెడ్డిని బొడిచి వైచినారు!

(పరిక్రమించి ముందుకుఁ జూచి)

శా. ఓరోరీ! రణ భీరులార! చటుల ప్రస్ఫూర్తిభగ్న చేతస్కులై
ఘోరా ధర్మ పథాను వర్తనమునం గొంకింతయుఁ లేక; స
ద్వీరుఁ బల్వురు గూడి కూలుతురె నిర్వీర్యాత్ములై? మిమ్ము దో
స్సారం బేర్పడ సంగరావని నిదే చెక్కాడెద నిల్వుఁడీ.

( అని తెరలోనికి నిష్క్రమించుచున్నాఁడు )

భాను—(ముందుకుఁ జూచి) ఏమీ? క్షత్రియుల ధైర్యము! నా తండ్రి నెంత నిర్భయముగఁ దాఁకినారు! భీరుఁ డనుకొనిరి కాఁబోలు! పాపము!

( తెరలో ) ఓరోరీ! అక్రమ విజయ ప్రమత్తులారా!

గీ. తులువలార! నన్నెతఁ డంచుఁ దలఁచినారొ!
అహిత వీరాధి వీర శుష్కాటవీ ప్ర
చండ తర వీతి హోత్రుఁడఁ జుండు; మీదు
పౌరుష మొకింత నాచెంతఁ బనికి రాదు.

భాను—(ఆలకించి) నిజము నిజము. నా తండ్రి కన్నులెఱ్ఱఁ జేసి చూచిన నీ రాచవీరు లొక లెక్కయా? (చూచి) ఆహా! నా జనకుని సంగ్రామ వైదగ్ధ్యము!

గీ. చండతర ఖడ్గమును దాల్చి చక్రమట్లు
దిరుగు నా ప్రియజనకు వధింపఁ దలఁచి
చేరఁబోవు విరోధుల శిరము లెల్లఁ
బుడమిఁ బడుచుండెఁ గొబ్బరి పువ్వులట్లు.

(చూచి) వహవా! అన్యాయమని జంకక రెండు ప్రక్కలుగా నా ప్రియ జనకునిపై బడిన రాచవారైదుగురు ప్రమృతి. అడిగో నా జనకుఁడిట్లే వచ్చుచున్నాఁడు.

(అపుడు రామదేవా రెడ్డి ప్రవేశించుచున్నాఁడు)

భాను—తండ్రీ! విజయమును జేకొని వచ్చితిరా?

రామ—కుమారా! ఏమి విజయము?

గీ. రాజనీతి విదుండు, పరాక్రమైక
ధనుఁడు, సత్కీర్తి వంతుఁడు, వినయమూర్తి
యైన నీలకంఠా రెడ్డి యస్తమించె
నెంత విజయమ్ముఁ గొన్న నింకేమి ఫలము.

భాను—నీలకంఠా రెడ్డి మరణమును గుఱించి మీ రెంత మాత్రము విచారింప వలదు. సర్వజ్ఞులగు మీకు నేను చెప్పఁ దగిన వాఁడను గాను. నీలకంఠా రెడ్డి యిన్నినాళ్లు నిష్కాపట్యముతో మీ సేవఁ జేసి యిప్పుడు వీర పురుషోచిత మరణము నంది ధన్యత్వం గాంచినాఁడు. ఆతని ని మీ రిప్పుడు మఱచి పోవలెను. సర్వసేనాధిపత్యమును వహించిన మీ రిప్పుడు తాలిమి వీడిన ముప్పు వాటిల్లును. కావున మీరు విగత విచారులై యీదారుణసంగ్రామమును సహస్రధా గనిపెట్టుచుండవలెను.

రామ—ఔను. నీవనిన ట్లిప్పుడు మనము నీలకంఠారెడ్డిని మఱచి పోవలెను. కుమారా! నీ విచ్చటనే యుండుము. నే నిదే యటు వోయి చూచి వచ్చెద. (అని నిష్క్రమించును)

భాను—కట్టా! వీరాధి వీరుఁడగు నీలకంఠారెడ్డి నీ క్షత్రియాధము లన్యాయముగ సంహరించి వైచిరి! ఈ రాచవారు కేవ లాసూయచే యుద్ధమున కుద్యుక్తులైరి. ఉద్యుక్తులై వారేమి యనుభవించిరి. మహా శూరుఁ బేరు వడిన నీలకంఠారెడ్డి యొక్కఁడే గతించెను. కాని వారి బలము నంకలి యనేక యోధులు గతించిరి. దురభిమాన దూషితులగుటచే వారీ నేరగతి నెఱుంగఁ జాలరు. అకటా! అశక్తి దుర్జనులగు నీ క్షత్రియులు తాము సుఖ పడ లేరు. ఇతరుల సుఖ పడనీరు.

( అప్పుడు తెరలో శంఖ ధ్వని యగుచున్నది )

భాను—(ఆలకించి) అల్లదే వైరి వీరాంగనా గర్భ నిర్భేదకమగు శంఖ ధ్వని విన వచ్చు చున్నది. ఆహా! ఇప్పటికిఁ గదా నా యవసరము గలిగినది! (ముందుకుఁ జూచి) అరిగో యోధు లెల్లఱుఁ బ్రక్కల నొదిగి నారు. ఇఁక జాలము సేయరాదు. ఓహో శతఘ్ని సైనికులారా! ఫిరంగులను బేల్పుఁడు పేల్పుఁడు.

(తెరలో ఫిరంగుల ధ్వని. అప్పుడు రామదేవారెడ్డి ప్రవేశించుచున్నాఁడు)

రామ—కుమారా! మంచి సమయమున ఫిరంగులను బేల్పించితి వి? (మురదుకుఁ జూచి) ఆహా! శతఘ్ని నిర్గతాయస గోళ పఙ్క్తుల శామ నీయకత!

గీ. ఘోరపు గుభాల్ గుభాల్ ధ్వని భోరు కొనఁగ
బాణ వేగమ్ము మీఱఁగ బంతు లట్లు
పాటి పోయెడి క్షత్రియ వీర వరుల
వెంటఁ బడి కూల్చు చుండెను వేల కొలఁది.

భాను—ఆహా! క్షత్రియ వీరుల గతి!

గీ. బంటుల విధమ్ముగా వెంటఁ బడు ఫిరంగి
గుండ్ల కోర్వఁగఁ జాలక కొంకు లేక
బుద్ధిగని క్షత్రియులు పాఱి పోవు చుండి
రొకఁడు వోయిన దెసకు వేఱొకఁడు వోక.

(మఱలఁ దెరలో ఫిరంగుల ధ్వని)

భాను—ఓహో శతఘ్నీ సైనికులారా! శతఘ్నీ ప్రయోగ మిఁకఁ జాలింపుఁడు.

రామ—(ముందుకుఁ జూచి) హత శేషులగు క్షత్రియ సైనికు లెంతెల్లో గుడారములం జొచ్చిరి. క్షత్రియ సైనికులు పాఱి పోవుటలో నద్వితీయులు!

(తెరలోఁ గోలాహలానంతరము)

రామ—(చూచి) తనయా! క్షత్రియ స్కంధావారమున నానంద సూచకమగు కోలాహలమును, వారి గుడారముల వెనుకఁ బరాగమును బయల్వెడలు చున్నవి. కారణ మేమో!

భాను—అద్దిరా! ఇప్పుడే గదా రాచవారు మన ఫిరంగి గుండ్ల ధాటి కోర్వఁ జాలక పాఱి పోయిరి! మఱల నింతలో నీయానంద మయ కోలాహల మెట్లుప్పతిల్లెను! (చూచి) క్షత్రియులు పాశుపత రెడ్డిని గెలిచి కొని యుందురు. ఆవిజయ వార్తా శ్రవణమే వారి కోలాహలము నకుఁ గారణమై యుండును. ఆపరాగము రాచవారికి సాయము చేయవచ్చు సైనికుల గమనముచే నుద్భవించి యుండును. ఆ సైన్యమును బరికించి పలాయనము గావించిన క్షత్రియ సైన్య మానందమయ కోలాహలము నొనరించు చున్న దేమో.

రామ—నీ రెండవ వచనమే బాగున్నది. అంతియే గాని వీరా

ధ వీరుఁడగు పాశుపత రెడ్డి సిరాచవారు జయింపఁ గలరా?

భాను—జనకా! మన మిఁక నుపేక్షించి యుండ రాదు. నఁఅబసం ర సన్నాహమును త్వరగఁ గావింప వలెను. కావున నేనిదే పోయి నిమిసములో ఫిరంగీల బారును సిద్ధము గావించి వచ్చెద.

(అనినిష్క్రమించును)

రామ—(తనలో) భాను మంత్రుఁడు చెప్పినట్లు వచ్చు సైన్యము రాచ వారికి సాయ పడుటకే వచ్చు చున్నది. (చూచి) అదిగో! క్షత్రియ లాంఛన చిహ్నిత మగు ధ్వజము.

భాను—(ప్రవేశించి) ఇంకను జూచెద వేల? జనకా! మన సైన్యమును బ్రబోధింపుము. ప్రబోధింపుము.

రామ—ఓహో భూమంచి రెడ్డి వీరులారా! సైనికులారా!

మ. హత శేషంబగు క్షాత్ర సైన్యమది నైజావాసముం జేరి, యు
ద్ధతుగా వచ్చెడి పెద్ద పౌజుఁగని యాత్మన్ ధైర్య మొందేని నేఁ
డి, తమిన్ దాఁకఁగ వచ్చుచుండె మనలన్నిగ్గింపఁగాఁ; గాన వాం
ఛిత సిద్ధిన్ బడయంగఁ బోరుటకు సంసిద్ధమ్ముగా నుండుఁడీ!

(తెరలో) సార్వభౌమా! మా దృఢ ప్రతిజ్ఞ నాలింపుము.

గీ. అనుగు దెంచితి మేము మీ యాజ్ఞ నిటకు
సాహసము మీఱ; రణమున శత్రువు లను
జంప వలయును; మే మైనఁ జావ వలయుఁ
గాని యిట నుండి సుంతైనఁ గదలి పోము.

రామ—సంతసంబాయె. ఓ సైనికులారా! రెడ్డి వీరులారా! ఇట్టి దృఢ దీక్షతోఁ బోరాడిన యెడల విజయ లక్ష్మి మనలనే వరించు ననుటకు సందియ మేమున్నది.?

భాను—నిజము నిజము. ఓహో రెడ్డివీరులారా! అల్లదే క్షత్రియ

సైన్యము సమీపించు చున్నది. నుజల మీా ప్రతాపముఁ జూపుటకు సమ యమైనది. సిద్ధముగ నుండుఁడు.

రామ--(చూచి) ఆహా! తనయా! చూచితివా హేమకూటారెడ్డి మహదానందముచేఁ దన గుఱ్ఱముచే నెట్లు నృత్యము సేయించు చున్నాఁడో!

భాను--(చూచి) జనకా! వీరునకును భీరునకును భేద మంతటిదే గాదా?

గీ. సమర తలమున శత్రుసైన్యమును గాంచి
పొంగి పోవును వీరుఁ డేనుఁగు నరసి
సింగమట్లు; సింగమ్ముఁ వీక్షించి సంత
మదకలంబట్లు భీరుండు బెదరి పోవు.

(తెరలోఁ గల కలా నంతరము)

రామ—(చూచి)అప్పుడే యిరువాఁగులు దలపడినవి. (ఆశ్చర్యము తో) ఏమీావింత! క్షత్రియ సైనికులు తమ్ముఁ దామే మ్రందించు కొను చున్నారేమి చెప్పుమా!

భాను—(చూచి) అద్దిరా! క్షత్రియుల పౌరుషము! నిజప్రాణాప హారకమైనదే!

(తెరలో)

రెడ్లకు జయమగుఁగాక! ఓహో రెడ్డి వీరులారా! రండు క్షత్రి యులను సంహరింపుఁడు.

రామ—(ఆశ్చర్యముతో) ఈ నూతన సైనికు లెవరోగాని రెడ్ల జ యము నాకాంక్షించు చున్నారు! క్షత్రియులను సంహరింపుఁ డను చున్నా రు! తనయా! వీరెవ్వరై యుందురు?

భాను--ఎవరో తోఁచకున్నది.

రామ——(చూచి) అప్పుడే క్షత్రియ సైన్యమంతయు నిహతమై పోయినది. ఎవఁడో గాని యోధుఁడొకఁ డశ్వారూఢుఁడై యిట్లే వచ్చుచున్నాఁడు.

భాను——చంద్రసేనాపతుల పరాగతము నెఱింగి మనకు సాయపడ వచ్చునొక క్షత్రియయోధుఁడై యుండ వచ్చునని తోఁచెడి. పినతండ్రిగారి తోడను హేమకూటారెడ్డి తోడను గలిసి యా యోధుఁ డిట్లే వచ్చుచున్నాఁడు.

రామ——తనయా! నిదానించి చూడ క్షత్రియ వేషధారి యని తోఁచుచున్నది.

(అప్పుడు ధర్మారెడ్డి, హేమకూటారెడ్డి, క్షత్రియ వేషధారియగు మహాదేవరెడ్డి ప్రవేశించుచున్నారు)

మహా——జయము జయము సార్వభౌమా!

రామ——(ఆశ్చర్యముతో) ఏమి మహాదేవరెడ్డి నీవేనా!

మహా——చిత్తము. ఏలినవారికిఁ గృపాపాత్రుఁడను.

భాను——ఓయీ! నీవీ క్షత్రియ వేషము నేల తాల్చితివి?

మహా——క్షత్రియులను వంచించుటకు.

రామ——సంతసంబాయె. ఓయీ! పాశుపతరెడ్డికి విజయమే గదా!

భాను——నీవేగు నప్పటికింకను యుద్ధము పూర్తిగా లేదా?

మహా——నేనేగిన నాఁటి సాయంకాలమునందే సంగ్రామము ముగిసి పోయినది. హతశేషులగు క్షత్రియ సైనికులు పాఱి పోయిరి. కాని పాశుపత రెడ్డి గారికి బలమగు గాయము తగిలినది,

రామ——ఏమీ! పాపము పాశుపత రెడ్డికి గాయము తగిలినదా?

భాను——నెమ్మదిగ నున్నదా?

ధర్మా——ఎచ్చటఁ దగిలినది?

ప్రేమ—ఎవరు కొట్టిరి?

మహా—చిత్రము. కొంచెము సన్నదిగ నున్నది. అతిశయముగ విక్రమించు చున్న యొక క్షత్రియ వీరుని సంహరించుట కొక రెడ్డి వీరుఁడొరనుండి నిశాత దీర్ఘ కరవాలమును దూయుచుండఁగా నాచెంత రాచవారిసేనానితోఁ బోరుచున్న పాసుపతిరెడ్డి గారి యెడమ భుజముపైఁ దగిలినది.

(అప్పుడు ప్రళయ భైరవుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ప్రళయ—రామదేవా రెడ్డీ! రాచవారు యుద్ధావసాన సూచకమగు ధ్వజము నెత్తినారేమి?

అందఱును—[ఉలికిపడి] గురువరా! వందనములు.

[ మ్రొక్కుచున్నారు ]

ప్రళయ—శుభమగుఁ గాక.

రామ—[నాచి] ఏమీ? రాచవారు కదనమును జాలించిరా? అసహాయ శూరుల వలె విక్రమించిరే! తమ్ముఁడా! కారణ మేమై యుండును?

ధర్మా—క్షత్రియుల శిబిరముల నుండి యొక యోధుఁడిటు వెంచుచున్నాఁడు. మనధాటి కోర్వఁ జాలక క్షత్రియులు శరణు వేడ నాయోధుని బంపినట్లు తోఁచు చున్నది.

భాను—అవచ్చు నాతఁడు మన సేనను బరీక్షింప వచ్చి పట్టు వడిన యాతఁడని తోఁచు చున్నది.

ప్రేమ—నిజముగ నాతఁడే.

ప్రళయ—ఊరకుండుఁడు.

[అప్పుడు గోపాల వర్మ ప్రవేశించు చున్నాఁడు]

గోపా—[తనలో] కటకటా! మేమెంత దుర దృష్ట వంతులమో

గాని మాకన్నియు నపజయములే సిద్ధించుచున్నవి. అందున నేనెట్టిమందభాగ్యుఁడనో గాని నేనే క్షత్రియుల పౌరుష హైన్యమును బ్రకటింపవలసి వచ్చుచున్నది. నాఁడు రెడ్ల సేనాపతిత్వార్థము పోయి రెడ్లచేఁ జిక్కితిని. నేఁడు రెడ్లను గడువు గోర నుంటిని. ప్రత్యక్షముగ రెడ్లతోఁ బోరిగెలుచుట కలలోని వార్త యని గ్రహించి సుబాహు చంద్రసేనులు మాయామార్గమున రెడ్లను గెలిచి కొనుటకు నిశ్చయించిరి. ఈసంగతిని బరమ రహస్యముగ నుంచి యింతవఱకుఁ గావించిన పోరాటములో మా సేన చాలవఱకు నశించి పోయిన దనియు నాహేతువుచేఁ గ్రొత్త ఫౌజును దయారు చేసికొని మఱల యుద్ధమునకు వచ్చుట కిరువది దినములు గడువీయ వలసినదనియు నిపుణముగా రెడ్లను గోరి వల్లె యనిపించుకొని రమ్మని మా ప్రభువులు నన్నంపిరి. కాని యీ రెడ్లు మా మర్మము నెఱింగి గడువీయక పోవుటయుండఁ దత్క్షణము నన్ను బాడిచి వైచి మా సేన నొక్కపెట్టున సంహరించి వైచెదరని తోఁచుచున్నది. సమయమునకు మా నెత్తిమీఁదఁ దాండవ మాడుచున్న శనియో యన క్షత్రియ ద్వేషియు, రెడ్ల పురోహితుఁడు నగు నీ ప్రళయ భైరవు డిచ్చటకే చేరినాఁడు. ఈతఁడు మమ్ము బ్రతుక నిచ్చునా? కానిమ్ము. వచ్చిన వాఁడను రానే వచ్చితిని. ప్రయత్నము సేయకుండఁ బో నేల? దైవయోగమెట్లున్నదో? ( పరిక్రమించి ) అభిమాన నిధానమగు క్షత్రియ కులమునఁ బుట్టుటచే రెడ్లను శరణు వేడుటకు నోరాడకున్నది. అయిన నేమి సేయుదును? చేసికొని నంత యనుభవింపక తప్పదు. (సమీపించి)

శరణు శరణు సార్వభౌమా!

భాను—(సోత్ప్రాసముగా) ఎవఁడీతఁడు? క్షత్రియుఁడేనా!

హేమ—క్షత్రియ మాత్రుఁడు గాఁడు. వీరుఁడును.

మహా—రెడ్లను సమూలముగ నాశనము సేయవచ్చిన క్షత్రియ వీరుండు.

గోపా—సగము చచ్చిన వారిమీఁగనా ప్రతాపములను జూపుట.

ప్రళయ—ఊరకుండుఁడు.

రామ—గురువరా! శరణు గోరుటలో క్షత్రియుని యభిప్రాయమేమో.

గోపా—అభిప్రాయమున కేమున్నది? మా ప్రభువులగు సుబాహు చంద్రసేను లిట్లు మనవి సేయు మని సన్నంపినారు. "అద్వితీయపరాక్రమసంపన్నులగు మీ సేనతో డీకొని పోరఁజాలక మా సేన చాలవఱకు గతించినది. కావున నింతట మేము మీతోఁ బోరఁ జాలము. మా కోరికను త్రోసి వేయరను నమ్మకముచే మి మ్మొక్కటి కోరుచున్నారము. మాకింకను మీతోఁ బోర వలయు నని యూహ యున్నది. కాని క్రొత్త దళమును సంపాదించుకొనుట కిరువది దినములు గడు వీయ వలె నని కోరుచున్నారము."

రామ—(తనలో) క్షత్రియులు ద్రోహము సేయ నెంచినట్లు తోఁచుచున్నది. అయినను శరణార్థులకు శరణ మొసంగుట ధర్మము. గురువర్యునియు బంధువులయు నభిప్రాయములఁ దెలిసి కొనియెద. (ప్రకాశముగ) గురువరా! ప్రియ బంధువులారా! ఈవిషయమై మీయభిప్రాయములఁ దెలుపుఁడు.

ప్రళయ—[తనలో] క్షత్రియ లొక్తి దుర్జనులై రెడ్లను బ్రత్యక్షముగ జయింప నోడి యిట్లు నమ్మించి ద్రోహము సేయ నెంచినారు.

భాను—[జనాంతికముగా ధర్మారెడ్డి, హేమకూటా రెడ్డి, మహాదేవరెడ్డి గార్లతో] రాచవారు నీతిలేని వారు, ద్రోహముసేయుట కిట్లు

కోరి యుండును. [ప్రకాశముగా] ఒక్క నిముసమైనను గడువీయఁగూడదు.

మహా—నా యభిప్రాయము నదే.

హేమ—గడు విచ్చుట నా కిష్టము లేదు.

ధర్మా—ఉత్తమ రాజనీతి ప్రకారము గడు విచ్చుట ధర్మము.

గోపా—[తనలో] ఈతఁడు మా వలలోఁ బడినాఁడు.

ప్రలయ—ధర్మారెడ్డి చెప్పినట్లు చేయుటయే ధర్మము.

గోపా—[తనలో] ఈ బ్రాహ్మణుఁడు గూడ నట్లే మా మాయా వాగురలం జిక్కి పోయినాఁడు.

ఖాను,—హేను,—మహా,—మీయిష్టము చిత్తము. మీ యాజ్ఞకు మేము బద్ధులము. కాని గడు వీయఁగూడదని మా యభిప్రాయము నివేదించుకొనుచున్నాము.

గోపా—[తనలో] ఈ ముగ్గురును గడు వీయవలదని గట్టిపట్టు పట్టినారు. కాని మంత్రియును, పురోహితుఁడును మా పక్షమే పల్కినారు. చక్రవర్తి యేమి చేయునో తెలియదు.

రామ—ప్రియ బంధువులారా! మీ యభిప్రాయములు నేను గ్రహించితిని. కాని యధర్మము సేయుటకు నా యంతరాత్మ యంగీకరింపదు. శరణార్థు లెట్టివారైనను శరణిచ్చుటయే ధర్మము. మీరు కనుఁగలిగి కడు జాగరూకతతో నుండుఁడు. ఓ క్షత్రియుఁడా! మీ వేడికోలు కంగీకరించితిమి. కావున నీవు నిశ్చింతతోఁ బోవచ్చు.

గోపా—చిత్తము. [తనలో] నామనసు కుదుటఁబడినది. విజయగర్వమ్మునమున్నమున్నగానక యీ రెడ్లు తలకుమించిన ధర్మమునకుఁబోయినారు. ఇఁక నిస్సంశయముగ రెడ్లను నాశనము చేయుటకై మా నేర్చిన మాయలన్నియు నుపయోగించెదము. వహవా! ఇఁక మీఁదఁ గదా మే

ము కృతార్థుల మగుట? (ప్రకాశముగా) సార్వభౌమా! పోయి వచ్చెద.

రామ—మంచిది.

(గోపాల వర్మ నిష్క్రమించుచున్నాఁడు)

రామ—గురువరా! బంధువులారా! ఇఁక మనము శిబిరములకుఁ బోయి విశ్రమింతము రండు.

ప్రళయ—నడువుము. (అని యిరువురు నిష్క్రమింతురు)

ధర్మా—(తనలో) అన్నగారధర్మమున కోడి గట్టలేక క్షత్రియులకు గడు వొసంగినారు. క్షత్రియులు ద్రోహము సేయక మానరు. కడు మెలఁకువతో నుండవలెను. (నిష్క్రమించు చున్నాఁడు)

" భాను—(తనలో) ధర్మపరానతారులగు తండ్రిగారన్యాయ మాచరింపలేక యిట్లుచేసినారు. నా యభిప్రాయము దుష్టుల యెడ దౌష్ట్యముపయోగింపవలె ననియే. అయినను దండ్రిగారి యాజ్ఞ యవిలంఘనీయము. (అని నిష్క్రమించు చున్నాఁడు)

సోమ—మహాదేవ రెడ్డీ! ఇఁక మన మిచ్చట నేమిటకు? సార్వభౌముని యాజ్ఞ యనుల్లంఘనీయము. విశ్రమింప సైన్యమున కాజ్ఞ యిత్తము రమ్ము. (అని యిరువురు నిష్క్రమించుచున్నారు)

ఇది తృతీయాంకము.



శ్రీ ర స్తు.

# రామదేవ విజయము.

## చతుర్థాంకము.



[ ఒక భటుఁడు ప్రవేశించుచున్నాఁడు. ]



భటు—(అంతటఁ జూచి తనలో) ఏమి చెప్పుచూ యుద్ధరంగ మట్లు నిశ్శబ్దమై యున్నది? ఇప్పుడు జాము ప్రొద్దెక్కినది. ఎవరి గుడారములలో వారు నిశ్చింతతో నున్నారు. కారణ మేమై యుండును? యుద్ధము పరిసమాప్తమై పోయి యుండునా? కాదు కాదు. అట్లయిన గెల్చిన వారోడి పోయిన వారిని గొల్ల గొట్టుకొనకుందురా? కాకున్న సంధి జరిగి యుండునా? దురాత్ములగు నీ చంద్రసేనాది క్షత్రియులతో రెడ్లకు సంధియా? (ముందుకుఁ జూచి) ఎవరో యిట్లే వచ్చుచున్నారు. తెలిసికొన వచ్చును.

( అప్పుడు మహాదేవరెడ్డి ప్రవేశించుచున్నాఁడు)

భటు—ఎవరు? మహాదేవరెడ్డి గారా?

మహా—(చూచి) నీవా! ఓరీ! పాశుపతరెడ్డి గారి కెట్లున్నది?

భటు—చాల వఱకు నెమ్మదిగా నున్నది. ఇచ్చట విశేషము లేమి?

మహా—ఏడెనిమిది దినము లిరు వాఁగులును దారుణ సంగ్రామము గావించినవి. మనయోధులలో నీలకంఠారెడ్డి యొక్కఁడే గతించెను. ముప్పదియాఱు వేల కాల్బంటులును నన్నూట యేఁబండ్రాశ్వికులును మడిసిరి. రాచవారిలో సుబాహుని యేడ్వురు కొడుకులు నిహతులైరి. వా

రి ఫిరంగులు రెండు నందలు మన స్వాధీనమైనవి. ఏడు వేల క్షత్రియ పదాతి బలము మన కారాగారమున నున్నది. వారిలో నాశ్వికులు, రథికులు, కాల్బంటులు, మొత్తము లక్షయు నెను బదివేలకుఁ బైగా గతించిరని కింవదంతి. అంతబలము నశించి పోవుటచే సంక రెడ్లతోఁ బోరుఁజాలమని భయపడి రాచవా రిరువది దినముల వఱకు యుద్ధము నాపుసేయవలసినదని మనవారిని బ్రార్థించిరి.

భటు—సార్వభౌముఁ డంగీక రించెనా?

మహా—శరణార్థులకు శరణ మొసంగ కుండుట ధర్మ బాహ్యమని సార్వభౌముఁ డంగీకరించెను కాని రాచవారు దుర్బుద్ధిచే మనయాయుధములను హరించుట కొక నిశిథ సమయమునఁ గిరాతుల నంపిరి. మనవారాదురాత్ముల నెఱింగి సంహరించి వైచిరి. మఱల నిన్నటి రాత్రి మనగుడారములకునిప్పంటించిరి. కాని ధర్మారెడ్డిగారప్పటికి మేల్కొనియుండుటచే నొక్క గుడారమైనఁ దగులఁ బడి పోకుండ నార్పివైచితిమి. తరువాత రాచవారికిఁక గడువీయఁ గూడదనిసే నిదే యుద్ధమును బ్రకటించుటకు రాచవారి స్కంధావారమునకుఁ బోవు చున్నాఁడను. నీవేగి చక్రవర్తి గారిని దర్శింపుము.

(అని యిరువురునిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము.



(తరువాత నొకశిబిరములో సుబాహుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సుబా—(తనలో)“ భూమంచి రెడ్లన నెంత? అప్రతిమ బాహా

శాలులము. సహార్య శౌర్య సంపన్నులము, గిరిధైర్యులము, సుక్షత్రియ వంశ సంజాతులము, నగు మనలను గూడ రెడ్లు జయింపగలరా?" యని చంద్రసేనుఁడు చెప్పిన మాటలు విని కాంబోజులనని సేనీసంగ్రామమునకు సిద్ధపడితిని. కాని రెడ్లశౌర్యాగ్ని యింత దుస్సహమైనదని యెఱుఁగను.

సీ. అంభోధి తఱచిన యప్పుడుద్భవించిన
కాలకూట రసమ్ము గ్రోల వచ్చు
సకల లోకములు భస్మము సేయు ముక్కంటి
కంటి మంటల నైనఁ గడువ వచ్చు
జేజేలకైన నజేయమౌ నలదండ
ధరు పాశమును నైనఁ దాళవచ్చు
సింధువు నైన శోషిల్లఁగా నొనరించు
బడబాగ్ని నైన సైపంగవచ్చు
గీ. కర్కశములగు గిరుల పక్షముల నింత
మాత్రముననె గూల్చి వైచు నమ్మఘవు కశను
వజ్రహతి నైన సైపఁగ వచ్చుఁ గాని
రెడ్ల శౌర్యాగ్ని సైప నెవరికిఁ దరమ్ము?

రెడ్లతోడి పోరాట మాటలు గాదు. చక్రవర్తి కార్తవీర్యార్జునుఁడే పాడు వేళ జమదగ్నిని జంపించెనో గాని నాఁటనుండియుఁ బరాక్రమ ధనులగు క్షత్రియులు నిస్తేజులై పోయినారు. ఇరువది యొక్క సార్లు పరశురామునిచే నిహతులై పోవుటచే క్షత్రియులు మొలల నింతలోఁ జేతికౌనఁ జాల కున్నారు. పాపి యగు పరశురాముఁడు మహేంద్ర గిరికిఁ బోయి యస్త్ర సన్న్యాసమును గావించెను గదా యని సంతసించుచుండఁగా దగిలిన చోటనే నొగులుట యనినట్లు క్షత్రియుల పాలిటికిప్పుడీ రెడ్లు దాపరించినారు. వివేకి యగు నవ్విధాత బ్రాహ్మణులను సకల విద్యా విశార

దులై, పరమ తపో ధనులై, విశ్వసృష్టి హేతుభూతులై యుండుటకును, క్షత్రియులను దుష్ట సంశిక్షక శిష్ట పరిరక్షకులై, ధరా పాలనము గావించుటకును వైశ్యులను కృషి వాణిజ్యాదుల నొనరించుటకును, శూద్రుల నగ్ర వర్ణ సంజనితుల పద దాస్యము సేయుటకును సృజించెను. కాని యీ భారత దేశపు దురదృష్టవశమునఁ బడ సేవ సేయ వలసిన శూద్ర కులజు లగు నీ రెడ్లు ప్రభువులైనారు. ఆహా! దైవగతి!

సీ. బ్రహ్మాండమైన వారాశి భూస్థల మౌను
భూ ప్రదేశము మహాంభోధి యగును
మేదుర క్షోదమ్ము మేరు భూధర మౌను
మేరు భూ ధరము దుమార మగును
తనుపైన మంచి గంధ మ్మగ్ని హోత్రమౌ
గన బాడబము మంచి గంద మగును
బిసులు మెసెడి గడ్డి పఱక వజ్రం బౌను
వజ్రాయుధము గడ్డి పఱక యగును
గీ. విష మమృత మగు నమృతమ్ము విషము నగును
ప్రాగ్గిరిని దోచు నా లోక బాంధవుండు
పశ్చిమాచల మందు నుద్భవము గాంచు
దైవ గని కడ్డ మున్నదే తలఁప నెందు?

రెడ్లతో నత్యల్ప సేనాని యగు నీలకంఠా రెడ్డి యొక్కఁడు మడిసెనో లేదో; మాలో ననేకులు మ్రగ్గిరి. నా యేడ్వురు కుమారులు గూడ నిహతులైరి.

సీ. బడబాగ్ని నైన సంబరము మీఱంగ హ
స్తములతో నాడించు సాహసికులు
కవచమ్ము దాల్చక ఖడ్గమ్ము బట్టక

పులిని గ్రుమ్మంది చెడి పోటు బంట్లు
ప్రబల సంగ్రామంబు ప్రాప్తమౌ పట్లను
నంతెనమ్ముగ గాంచు శౌర్య ధనులు
పరమ శాత్రవ్యుడైన భయమంది పెఱ తెంచి
శరణన్న రక్షించు సరస వరులు
గీ. మానమే ప్రాణముగ నెంచి మసలు వారు
నిగిడముల్లు వెలుగొందు ధీర వరులు
నైన నా యోధ్యా రాత్మజు లని సమయుట
నక్కటా! దక్కు మాలిన పక్కినైతి.

పరాక్రమైక ధనులగు నా కుమారులలో నేవ్వర నొక్క రామ దేవా రెడ్డినే సంహరించి వైచెను. నా క ద్దురాత్ముని దలంచు కొనిన నోడలా పాన మస్తకము గంప మెత్తు చున్నది!

మ. అనఘుం బుత్రుల శౌర్య రాశులను నన్యాయమ్ము గావించి త్రుంచినయా ద్వేషము దీఱ రెడ్ల ననిలో శీఘ్రంబ చెంటాడి, న
మ్మున మానంద రసాబ్ధిలో మునుగ సామ్రాజ్యాధి కారమ్ము నేగని రెండఱాళ్లను చక్రవర్తి సతికి గ్రాసార్థమై యిచ్చెదన్.

(అప్పుడొక బ్రాహ్మణుడు ప్రవేశించు చున్నాడు)

బ్రాహ్మ—(తనలో) అశక్తి దుర్జనులగు చంద్రసేనాది క్షత్రియులు నక్షత్ర సంచారులగు రెడ్లతోడ బత్యక్షముగ బోర నోడి మాయామార్గమున వారి బలమును నిర్మూలము గావింప జూచు చున్నారు. సాధ్యమైనంత వఱకు మాయల నెఱింగి రెడ్లకు దెలుప వలెను. (పరిక్రమించి చూచి) ఇదిగో! ఇచ్చట సుబాహుడొక్కడు కూర్చుండి యున్నాడు. ఇప్పుడీతని చెంత కేగెద. బ్రాహ్మణుడ నగు నాతో నీ క్షత్రియుడెట్లు మాట్లాడునో చూచెద. (సుబాహుని సమీపించుచున్నాడు)

సుభా—(విసుగుతో) ఎవరు?

బ్రాహ్మ—(తనలో) శివ మెత్తుచున్నది. బ్రాహ్మణుల యెడల క్షత్రియుల కెంత ద్వేష మున్నది? (ప్రకాశముగా) ఎవరైనదియుఁ దెలియుట లేదా?

సుభా—నీవు రెడ్ల పరిపాలనము నంగీకరించు బ్రాహ్మణుడ వేనా?

బ్రాహ్మ—నిరభ్యంతరముగా.

సుభా—పాద సేవ సేయవలసిన శూద్ర కులజులగు రెడ్లచేఁ బరిపాలింపఁ బడుటకు నీకు సిగ్గు లేదా?

బ్రాహ్మ—రెడ్ల ప్రభుత్వములో నుండుటకు మాకు లజ్జ యుండవలసిన పని లేదు. ఏమందు వేని,—

సీ. వటులు విప్రుల పిల్లవానిఁ గన్గొనినను
మది భక్తి మీఱ నమస్కరింత్రు
కష్ట సాధ్యములైనఁ గడు సమ్మతమ్మున
ద్విజుల కోరికలను దీర్చుచుంద్రు
జను లెల్ల సంతోష సాగరమ్మునఁ దేల
మించి రాజ్యమ్ము పాలించుచుండ్రి
బ్రాహ్మణులలజ్జఁ బడుదురో యని వేయి
కన్నులతో నెప్డు గాంచుచుండ్రి
గీ. అఖిల దివ్య కళావేదులగుటఁ జూచి
కౌతుకమున మాన్యము లిచ్చి గారవింతు
రట్టి భూమంచి రెడ్ల రాజ్యమ్ములందు
నుండఁగా మాకు సిగ్గేల యుండవలయు?

ప్రభువు లెవరైనను మాకిష్టమే. ప్రజా సౌఖ్యము నపేక్షించెడి వారైనచో వారే జాతి వారైనను మా కానందమే. కాని ప్రజా సౌఖ్య

మహేక్షింపని యెడల నుత్తమ జాతి వారగుట కారణమున క్షత్రియులను మేము మన్నింపము. రాజ్యపాలనకుఁ దగిన క్షత్రియుఁడ నని విఱ్ఱవీగు నీ పరిపాలనమునఁ బ్రజలెంత యశాంతులై యున్నదియు నే నెఱుఁగనిది కాదు.

సుబా—బ్రాహ్మణులకు మానాభిమానములు లేవు. ఎంత నీచాతి నీచములగు పనుల యందైనను బ్రవేశింతురు. బ్రాహ్మణుల కోరికను దీర్చువాఁడు చండాలుఁడైనను నరే వారికి వాఁడే సత్పురుషుఁడు. ఛీ! బ్రాహ్మణులను గౌరవింపఁ గూడదు.

బ్రాహ్మ—పరశురాముని శౌర్యాగ్ని కోడిగాజులు తొడిగించుకొనినపు డీ క్షత్రియుల మానాభిమానము లన్నియు నే మూల దాఁగినవో! శెట్ల రాజ్యములో దొంగతనముగాఁ బ్రవేశించుటయు, వారితోఁ బ్రత్యక్షముగఁ బోర లేక గడువు గోరుటయు, నిశీథ సమయముల నక్కృత్యములను గావించుటయు మానాభిమానము లున్న వారు సేయు పను లేకాఁబోలు! బ్రాహ్మణులు సేయని దే పనియు సాగదు. బ్రాహ్మణులు సర్వజన పూజ్యులు. నీ కింత బ్రాహ్మణ ద్వేషము గూడదు. ఓ క్షత్రియుఁడా! ఇటు వినుము.

శా. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర సరణిన్ బ్రాధాన్యతం గాంచె నీ
బ్రాహ్మణ్యంబిటు పెక్కు రీతుల నికన్ వ్రాకున్నఁగా నేటికీ
బ్రహ్మాండ స్థితి కూఁతమై నిలిచె నీ బ్రాహ్మణ్య మస్లాటచే
బ్రహ్మ ద్వేషము పాడు సేయు నరు సంపత్సౌఖ్య విధ్వంసియై.

యోచించు కొనుము. నే నిదే పోవుచున్నాఁడ. (నిష్క్రమించును)

సుబా—(తనలో) అన్నా! బ్రాహ్మణుఁ డెంత నిర్భయముగ నిందించి పోయెను! శెట్లు సత్పథ సంచారు లంట! మే మన్యాయ ప్రవర్తకులమంట! ఎంత పోతరించి యున్నా రీ బ్రాహ్మణులు! శెట్లతోఁ బోరుటకన్న

మా కిప్పుడు బ్రాహ్మణుల నవమానము సేయుటయే ముఖ్యము.

ఉ. సంధి యొనర్చియో; రణము సల్పఁగఁ జాలక పాఱి పోయి యో;
సింధు సమాన ధైర్యముచఁ జెండియొ రెడ్లను; రెడ్ల పాలన
మ్మాం ధర యం దతుల్య మని మోదముతోఁ గొనియాడు నట్టి గ
ర్వాంధులు బ్రాహ్మణాధముల కాపయిఁబెట్టక ముప్పతిప్పలన్.

(అప్పుడు చండ్రసేనుఁడు ప్రవేశించు చున్నాఁడు)

చండ్ర—(తనలో) ఈ రెడ్ల సంతతము లే నట్లు తోఁచు చున్నది. ఎన్ని విధములఁ బ్రయత్నించినను వారి చెంత కేఁగుటయే మా కసాధ్యముగ నున్నది. వారిని బ్రత్యక్షముగ జయింప లేక మాయచే జయింపఁ బ్రయత్నము సేయు నదియు విఫల మైనది. ఇప్పుడు మఱల రెడ్లు యుద్ధమును బ్రకటించినారు. చేసిన ప్రయత్నము లెల్ల విఫలములగు చుండుట చేతను బైఁ బై తన యోద్ధ్వారు పుత్రులు ప్రుగ్గుట చేతను దొలుతనే రెడ్లను గాంచి భయ పడిన సుబాహుఁ డిప్పుడు బెదరి పోయి యుండును. అయినను నిన్నటి దినమున నాతని భార్య యగు భానుమతి వ్రాసిన జాబు జూచుకొనిన తరువాత నొక్కింత పౌరుషము వచ్చి నట్లు తోఁచు చున్నది. ఏమైన నగుఁ గాక. ప్రయత్నము సేయక తప్పదు. నాకు శక్తి యున్నంత వఱకు రెడ్లను నాశనము సేయుటకే ప్రయత్నించెద. (పరిక్రమించి చూచి) అదిగో! సుబాహుఁ డటఁ గూర్చుండి యేమో యోచించుకొను చున్నాఁడు. ఆతనికిఁ బౌరుషము గల్గు నట్లి ట్లనియెద. (ప్రకాశముగా)

చ. గురు భుజ విక్రమాన్వితు, లకుంఠిత ధైర్యులు, పోటుబంట్లు దు
ర్భర రణరంగ సంచరణ పార్థులు నైన సుబాహు పుత్రులన్
దురమున న్యాయహీనులయి ద్రుంచిన రెడ్లను వాఁడి మీఱఁగా
సిరముగ మట్టు పెట్టి పగఁ దీర్పక నిద్దుర వోవ నింతయున్.

(అని సుబాహుని సమీపించుచున్నాఁడు)

సుబా—మిత్రమా! రమ్ము. మఱల నేమైన యోచించితివా?

చంద్రి—యోచించుట కవకాశమేది? రెడ్లు మఱల యుద్ధమును ప్రకటించినారు.

సుబా—ఆఁ! యుద్ధమునే ప్రకటించిరా? మిత్రమా! కాని కూటి కొడి గట్టినను గడుపు నిండినది గాదు సుమా!

చంద్రి—కానిమ్ము. రెడ్లు యుద్ధముఁ ప్రకటించి నంత మాత్రమున మన మిప్పుడు వెఱతుమా?

సుబా—ఇన్ని దినములు పోరాడి యిప్పుడు వెఱవనేల? అదియుఁ గాక, చంద్రిసేనా!

మ. అని నా పుత్రుల నేద్వీరం దునిమి యన్యాయమ్ముగా; నాకు ద్దా
రుణ దుఃఖమ్మును గల్గఁ జేసిన మహా క్రూరాత్ములై నట్టి రె
డ్లను ఘోర ప్రధనంబునం దునిమి యుల్లంబార పగం దీర్చ కే
చనినన్ బ్రువ్వఁగఁ దిట్టరే జనులు లజ్జాహీనుఁడం చెంతయున్.

కావున జయాపజయములకు దైవము పై భారము వైచి యుంకను కోరుదము.

చంద్రి—వహవా! అదియే పౌరుషము! మిత్రమా! సుబాహరా!

ఆ. వె. రెడ్డి వీరు లొండె రేఁగి సుక్షత్రియ
వీర వర్య లొండె విజయ లక్ష్మిఁ
బొందవలయుఁ గాని పోరాడ లేక వ్య
ర్థముగఁ బోవు వారె రాచ వారు?

( తెరలో )

గీ. గడుపు గోరితి మంచు సంగరము సేయ
వేడ్కఁ బేర్పకుఁ డో రెడ్డి వీరులారా!
ఏను గోపింప మీ వల్ల నేమి యగును?

క్షత్రియుల శౌర్యవహ్నికసాధ్య మున్నె?

సుబా—(ఆలకించి) ఆకంఠధ్వని నీ సూనుఁడగు వీరసేనునిదే గాదా?

చంద్రి—(ఆనందముతో) అవును.

( అప్పుడు ‹‹ గడువు గోరితి ›› మను పద్యముఁ జదువుచు
వీరసేనుఁడు ప్రవేశించును )

చంద్రి—కుమారా! రమ్ము. (చెంతఁ గూర్చుండఁబెట్టుకొని) రెడ్డి వీరులను ద్రుంపఁగలవా?

వీర—జనకా! అదెంత పని? రెడ్లేమి వర ప్రసాదులా?

గీ. అరుల సైన్యమ దెంతైన నగును గాక
నిముసమున గూల్చి వైతు యుద్ధమున నేను
పర్వతం బెంత? పిడు గెంత? పడిన యంత
క్షణములో ముక్క ముక్కలు గాదె జనక!

చంద్రి—కుమారా! నా గోత్రము నిలిపితివి!

సుబా—మిత్రమా! బెబ్బులి కడుపున మేఁక పుట్టునా?

( తెరలోఁ గలకలారావము )

చంద్రి—శత్రువులు సమీపించు చున్నట్లున్నారు. సుబాహూ! త్వరపడుము. త్వరపడుము.

సుబా—మన సేన సిద్ధముగ నున్నదా?

సేవకుఁడు—(ప్రవేశించి) మహాప్రభూ! మన సేన రెడ్లతోఁ దాఁ నది. ఏలిన వారు త్వరపడవలయును.

చంద్రి—(ముందుకుఁ జూచి) సుబాహూ! మనము లేక పోవుట చే మన సైన్యము జంకు చున్నది. లెమ్ము. లెమ్ము.

సుబా—ఓ క్షత్రియ సైనికులారా! జడియకుఁడి జడియకుఁడి, మే మదే వచ్చుచున్నారము.

(అని సుబాహు చంద్రసేనులు నిష్క్రమించు చున్నారు)

వీర—(చూచి) రెడ్ల సైన్యమీదిక్కున విజృంభించుచున్నది. మదగజసంఘము పైఁ బడు కొదమ సింగము మాడ్కి నే నీ రెడ్ల పైఁబడెద.

( అని రణ రంగమున కేగు చున్నాఁడు )

(తెరలో) ఓరోరీ! క్షత్రియ హాతకులారా!

గీ. కదనమును జేయఁ జాలక గడువు గోరి
సిగ్గులేక దుష్కృత్యముల్ సేయ నేల?
పోరుటకు మేము వచ్చి యున్నార మిదిగొ
రండు శౌర్యమ్ము గలిగిన రాచవారు.

వీర—(ఆలకించి) ఆఁ! ఈ రెడ్డి వీఁ డెవఁడో గాని యెంత గర్వించి యున్నాఁడు! (చూచి) భానుమంతుఁడే నా? ఏమీ వీని కావరము! ఓరోరీ! పరాక్రమలవ దుర్విదగ్ధా!

మ. అదిరా! శూరుఁడవౌదు; మాటలను శౌర్యమ్మంతయుం జెల్లెనే
నది; నిందాకఁగఁ జెట్టలేల? రణ సన్నాహమ్ము దీపింపఁగా
నిదె నే వచ్చితి ని న్నెదుర్చుటకుఁగా నీ పైని డంబమ్ములన్
వదరం బోవక నిల్చి నా యెదుట సంగ్రామమ్ము గావింపురా!

(అప్పుడు భానుమంతరెడ్డి ప్రవేశించుచున్నాఁడు )

భాను—ఏమీ? ఎవఁ డీ కాఱు లఱచు వాఁడు! (చూచి) వీరసేనుఁడా! ఓరోరీ! దురాత్మా! రమ్ము.

వీర—ఓరీ! ఇఁక నీ యాట లిచ్చట సాగవు.

ఆ. వె. మానవగతులకును మాటలు ప్రేలుట
పౌరుషమ్ము గాదు; బాహు బలముఁ
గల్గి యుండితేని కత్తినిఁ గెలుపుమి
వచ్చినాఁడ నీకు మచ్చ మాప.

చంద్ర——(ప్రవేశించి) వహవ్వా! కుమారా! తత్క్రియ వీరునకుం దగినట్లు పల్కితివి!

భాను——ఆహా! మెచ్చుటకు నీవు వచ్చితివా? ఓరీ వీరసేనా! ఏదీ కత్తిం గలుపుము.

(అని యిరువురు కొంత తడవు పోరిన పిదప వీరసేనుఁడు పాఱిపోవును)

భాను——ఓరోరీ! రణరంగభీరూ! ఎందుఁ బోయెదవురా?

(అని వెంటఁ బడుచున్నాఁడు)

చంద్ర——(తెల్లవోయి) నా పుత్త్రుఁ డెంత పౌరుషము లేని పని జేసెను! (చూచి) అయ్యో! భానుమంతుఁడు నా పుత్త్రుని సంహరించి వేసినాఁడు. హా! తనయా!

భాను——(ప్రవేశించి) చంద్రసేనా!

క. మెచ్చితి సుతు మాటలు విని
హెచ్చుగ మది; నింతలోన నీక్రియ నేడ్వం
జొచ్చితి హా సుత యనుచును
జిచ్చఱయ్యెనె మెప్పు వీర సేనుని యెడలన్?

చంద్ర——ఓరోరీ! నరాధమా!

చ. గరువము మీఱి సంగర ముఖమ్మునఁ దలంగక యెన్నఁడేని స
బ్బరముగ మేలు మేలనఁగఁ బోరొనరించెడి మత్కుమారకున్
బోరిగొని విక్రమించినను బుత్త్ర విహీనుని జేసితీవు; నేఁ
బోరిగొని నిన్ను నీ జనకుఁ బుత్త్ర విహీనునిగా నొనర్చెదన్.

భాను——మాటలు చెప్పవచ్చు. నన్ను బోరి గొనుట నీతరముగాదు. ప్రాణములపై నాశ లేనిచోఁ బోరుటకు రమ్ము.

చంద్ర——ఓరీ! తులువా! ఇదిగోఁ గాచి కొనుము.

(అని యిరువురుఁ బోరు చుందురు)

(అప్పుడు సుబాహుఁడు ప్రవేశించును)

సుబా—మహావా! చంద్రసేనా! ఇదేసమయము!

(అని తానుగూడఁ బోరుచున్నాఁడు)

(తెరలో)

ఓరోరీ క్షత్రియాధములారా! అధర్మప్రవర్తకులారా!

క. నిలుఁడు నిలుఁడిర్వురొక్కట
ఖలులారా! యొక్క బాలు గదిసి దురమ్మున్
జలుపం జూచెదరే? యుం
డుల కేగెదరింక? మిమ్ము దునిమెద నిపుడే.

సుబా—చంద్రసేనా! చచ్చితిమి.

(అని యిరువురుఁ బాఱి పోవుచున్నారు)

భాను—ఓరోరీ నీచులారా! ఎందుఁ బోయెదరురా?

(అప్పుడు హేమకూటారెడ్డి ప్రవేశించుచున్నాఁడు)

హేమ—ఛీ ఛీ! పిఱికిపందలారా! మీరింతటి వీరులా?

భాను—అన్నా! హేమకూటారెడ్డీ! ఎంత పౌరుషము లేని పనిజేసితివి?

హేమ—యువరాజా! అట్లనెద రేలా?

భాను—క. రెడ్డివి నే; నల శత్రువు
లొడ్డి విజృంభించి దురము నొనరించుచో
విడ్డూరముగా నపుడీ
వడ్డముగా వచ్చి సమర మాపంగనగునే?

హేమ—యువరాజా! ఇద్దఱొక్క బాలునితోఁ బోరాడు నపుడెట్టూరకుండ దగును?

భాను—అది యశక్తి బాలుర విషయము. ఇరువురుగా దిరుగ.

ది మంది వచ్చినను జంద్రసేనాదులు నన్ను గెలువఁగలరుగా? అక్కటా! నా ప్రాణప మంత్రియు విశ్వాసఘ్నుఁడై పోయెనుగదా! ఇఁక నాకీ ఖడ్గమెందుకు? (అని క్రిందఁ బాఱవైచుచున్నాఁడు)

హేమ—(తనలో) అకటా! యువరాజు హృదయమెంత కొట్టుకొనుచున్నది? అదృష్టం తిమ్మల బాఱినుండి రక్షింపఁ దలంచితిని గాని యింత మొగ్గువుట్టునని గ్రహింపలేక పోయితిని! ఇప్పుడు యువరాజస్త్రసన్న్యాసము గూడఁ గావించినట్లు తోఁచుచున్నది. కట్టా! ఏమగునోగదా? (ప్రకాశముగా) యువరాజా! నా వలన నపరాధమైనది. నా తప్పు సైరించి యీ ఖడ్గముం జేకొనుఁడు. [అని యిచ్చుచున్నాఁడు]

భాను—హేమకూటారెడ్డీ! ఇఁక నేమి లాభము? ఆ ఖడ్గమును బుచ్చుకొని నీతోఁ బోరవలెఁగాని యిఁక నా కా సుబాహు చంద్రసేనులు చిక్కెదరా?

హేమ—యువరాజా! అదెంతపని? నిముసములోఁ బట్టుకొనమా?

భాను—నిజముగనా?

హేమ—అబద్ధమాడెదనా?

భాను—[ఖడ్గమును బుచ్చుకొని] హేమకూటారెడ్డీ! అట్లయినసరమ్ము. ఓరోరీ! క్షత్రియాధములారా!

మ. మది సూహించి వశమ్ము జేసికొన సామ్రాజ్యార్థ కారమ్ముఁ దు
ర్మదులై వచ్చి దురమ్ము సేయుటకుఁ బ్రారంభించి సేనాధపుల్
మద నా కోపముఁ గాంచి భీతిలి లిసన్మానంబు వోనాడి దూఁ
కెదరే? సంగరసీమనుండి పటు వక్రీభూత చేతస్కులై.

[ అని యిరువురు నిష్క్రమించుచున్నారు ]

ఇది చతుర్థాంకము.



శ్రీ ర స్తు.

# రామ దేవ విజయము.

## పంచమాంకము.



[ ఒక భటుఁడు ప్రవేశించు చున్నాఁడు. ]



భటు——(పైకిఁ జూచి తనలో) ఇప్పుడు రెండు జాముల రాత్రియై నది. గాఢ నిద్రచేఁ గన్నులు మూసికొని పోవుచున్నవి. సుఖముగా ని ద్రింతమన్న వీలు లేదు గదా? ఆహా! సేవక వృత్తి యందున్నంత య స్వాతంత్ర్యము దేని యందైనఁ గలదా?

సీ. తన గృహ రక్షణమ్మును మాని సతతమ్ము
నొడయు నింటిని గాచు చుండ వలయుఁ
దన కన్న సంతానమును గాంచుటను మాని
యొడయు సంతతి గాచు చుండవలయుఁ
దన సౌఖ్యముల నెల్లఁ దలఁచి కొంటయె మాని
యజమాను సౌఖ్యమ్ము నరయ వలయుఁ
దన ప్రాణముల యెడఁ దమి వీడి తాఁ గొల్చు
ప్రభుని ప్రాణములఁ గాపాడ వలయు

గీ. నిట్టి కష్టమ్ము లధికార మెచ్చు కొలఁది
నధికమగు; నెంత చెట్టున కంత గాలి
యనెడు నార్యోక్తి సన్మత మగునె?
సేవకత కన్నఁ గష్ట మీ సృష్టిని గలదె?

సేవక వృత్తి యింత నికృష్ట మగుట చేతనే యుదార చిత్తులు దీనిని గర్హింతురు. తొలు వ్రాల్తినే నంత కష్ట పడ కుండఁగనే నెలకుఁ బది రూపాయిలు సంపాదించుకొన వచ్చు ననుకొంటిని. గాని యిప్పుడీ రాత్రులయందుఁ బ్రహరిఁ దిరుగు నప్పటికి నా తాతలు దిగి వచ్చుచున్నారు. అన్నిటి కేమి గాని రాత్రియందుఁ బ్రహరిఁ దిరుగుట నా గర్భ శత్రువులకైనఁ జేకూఱఁగూడదు. ముమ్మాటికిఁ గూడదు. (నిస్పృహతో) ఎంములకు నే నిట్లు విచారించుట? ఎవరైన విననా? విని రక్షింపనా? నే నింతయే పెట్టి పుట్టితిని. [అని ప్రహరిఁ దిరుగు చున్నాఁడు]

[ తెరలో రోదన ధ్వని యగుచున్నది ]

భటు—(ఉలికి పడి తనలో) ఏమిది? అర్ధ రాత్రి వేళ రోదన ధ్వని సేయు వారెవరు? ( ఆలకించి ) మఱల విన వచ్చుట లేదు. ఏ యోధుఁడైన దుస్స్వప్నము వచ్చుటచే నేడ్చె నేమో.

[ అప్పుడు సుబాహు చంద్రసేనులు ప్రవేశించుచున్నారు. ]

చంద్ర—[ మెల్లన ] సుబాహూ! నేను చక్రవర్తి రెండవ మూఁడవ పుత్రులగు కామ దేవ కరహాటక రెడ్లను సంహరించి వేసితిని. నీవు ధర్మారెడ్డిని జంపితివా లేదా?

సుబా—చంపకేమి? ఒక్క వ్రేటున నాతని కంఠము లేఁత తామర తూఁడు వలెఁ దునకలై పోయినది.

చంద్ర—ఇఁక భానుమంతరెడ్డిని, సార్వభౌముఁడగు రామ దేవా రెడ్డిని, హేమకూటారెడ్డిని సంహరింప వలెను. చప్పుడు కాకుండ రమ్ము. [ఒక్కింత నడచి] ఆగు మాగుము. ఇచ్చట నొక భటుఁడు ప్రహరిఁ దిరుగు చున్నాఁడు. ఈ ప్రక్కనుండి డేరా గుడ్డఁ జింపి లోనఁ బ్రవేశింతము రమ్ము. [అని డేరా గుడ్డను కటారిచేఁ జింపి లోనికిఁ బోవుచున్నారు]

భటు—ఇచ్చటఁ గొంచెము యలుకుడైన నట్లు తోఁచు చున్నది. ఎవ

రు నీ వెనకు రాలేము గద? [ అటు నిటుఁ జూచి ] ఎవరును గాన్పించుట లేదు,

[ తెరలో ]

ఏమీ? నా తమ్ములను బిం తండ్రిని నిదురలో సంహారించిన పాపాత్ము లు మీరేనా? ఓరోరీ క్షత్రియాధము లారా! గ్రం కేఁచుఁ బోయెదరు రా?

మ. వనధిక్ బ్రుంగి; గోత్ర భూధర గుహా వాసమ్ము గావించినన్
ఘన పాతాళము జేరినన్ సిబిడ కాంతారమ్మునం డాఁగినన్
వనజా ప్త ప్రభవమ్ము. గాక మును నస్వ్యాఘులన్ సంహారిం
చిన యో దర్పకు లార! తప్పక శిరచ్ఛేదమ్ము గావించెదన్.

భటు—[ఉలికిపడి తనలో] ఏమీ క్షత్రియులు రెడ్లను సంహారించిరా? అయ్యో! ఎంత కష్టము? నే నిచ్చటఁ బ్రహరిఁ దిరుగు చుండఁగా రాచ వారెట్లీ గుడారములోఁ జొచ్చిరి? అయ్యో! అయ్యో! ఆ దురాత్ములు యువరాజు కంటఁ బడినారు. ఇఁక వాండ్ర ప్రాణములు నిలువవు. అద్దురాత్ముల రాకఁ దెలిసికొనఁ జాలక పోవుటచే నా ప్రాణములును నిలువవు హా హా!! నాపాపము పండినది.

[ మరలఁ దెరలో ]

అన్నా! ఈ తుచ్ఛులు తండ్రి గారి శిబిరము వెనకుఁ బోవుచున్నారు. ఏమి కీడు మూఁడునో గదా?

భటు—(వడఁకుచు) అయ్యో! అయ్యో! సార్వభౌముని శిబిరము వెనకే పోయినారా? హా హా!!చచ్చితిఁ జచ్చితి.

[ అని నిష్క్రమించు చున్నాఁడు ]

ఇది విష్కంభము.



(అని యూతని వెనుక దాఁగు చున్నాఁడు)

రామ—కుమారా! ఆగు మాగుము. (తనలో) భానుమంతుఁడు క్షత్రియులు ప్రియ బంధువు లను జంపి రను చున్నాఁడు ఎవరికి? ఏమిది?

భాను—(తెల్లనోయి తనలో) ఏమిది? నాతండ్రి క్షత్రియాధము లను సంహరింపఁ బోవ న న్నడ్డగించు చున్నాఁడు? (ప్రకాశముగా) తండ్రీ! నాయనుంగుఁ దమ్ములగు కామదేవ కర హాటక రెడ్లను, మీకూర్మి తమ్ముఁడగు ధర్మారెడ్డిని వధియించు చుండఁ దుమించి వచ్చిన క్షత్రియ హతకులను సంహరింపఁ బోవు నన్నడ్డ గించెద రేల?

రామ—ఏమీ కుమారా! కామదేవ కరహాటక ధర్మారెడ్లనే సంహరించిరై చిరిగా క్షత్రియులు! హా హాతోస్మి: హా హతోస్మి!

గీ. అక్కటక్కట! తమ్ముఁడా! యనఘవీర!
రాజ్య తంత్ర విశారదా! రణ వినోద!
నన్ను సోదరు విడ నాడి నాకమునకుఁ
బోయి నాఁడవె? వేలుపు మూఁక నేల?

హా! కామదేవ కరహాటకులారా!

క. అకటా! ధీ నిధులారా!
ప్రకటాధిక శౌర్య కధైర్యబలయుతులారా!
వికటముగ శత్రువులచే
నకటా! వధియింపఁ బడిరె? హా! సుతులారా!

హా! సుబాహు చంద్ర సేనులారా! నా తమ్ముని నా తనయులను సంహరించిన మీ కేమి వచ్చినది? మీ ప్రబల విరోధిని నేను గదా? నన్ను వధించిన మీకు సార్వభౌమత్వ మప్రశమముగ లభించి యుండునే!

భాను—జనకా! మీ కంత దైన్యమేల? నే నిదే యి ద్దురాత్ము లం బొరిగొనెద. (అని సుబాహుచంద్రసేనుల మీఁది కురుకుచున్నాఁడు)

సుబా,--చంద్రి--సార్వభౌమా! అన్న మాట నిలుపుకొనుము.
(అని చక్రవర్తి వెనుక డాగుచున్నారు)

రామ—కుమారా! ఆగుమాగుము. ఈ రాచవారు నా తమ్ము నిగుమారులను సంహరించిన వారే యైనను నాచే నభయ ప్రదానము గాంచినారు. కావున వారి వెనకుఁ బోకుము.

భాను—హా! చచ్చితిఁ జచ్చితి!

రామ—తనయా! విచారించెద వేల?

భాను—అయ్యో! తండ్రీ! నా పితృతండ్రిని నా తమ్ములను నన్యాయముగ సంహరించిన యీ సుబాహు చంద్రసేనుల శిరములను సూర్యోదయము కాక మున్న ఖండించెద నని ప్రతిజ్ఞ దాల్చితిని!

రామ—ఆ! ఆ! కుమారా!

గీ. ఇప్పుడె వీరల కభయమ్ము నిచ్చినాఁడఁ
జేరి మీ ప్రాణముల రక్షింతు ననుచు
శపథమును దాల్చినాఁడవు జలజమిత్రుఁడు
తొలి మలను దోఁచు నంతలోఁ ద్రుంతు ననుచు.

అక్కటా! రెండ్లకులమునకిప్పుడు మహాప్రళయమునంభవించి నట్లున్నది!

చంద్రి—(తనలో) యువరాజ సార్వభౌముల హృదయము లిప్పుడత్యంత చింతాగ్నిచే దగ్ధములై పోవుచున్నవి! నత్పథ సంచారుల మగు మమ్ము బాధ పెట్టిన యనుపు తగులక పోవునా?

రామ—కట్టా! నా కెట్టి దురవస్థ తటస్థించెను! ఓ దైవమా!

క. విడిచెదనా సత్పుత్రుని
విడిచెదనా ప్రాణములను వేగిర పడి నే
విడిచెదనా ధర్మమ్మును
విడువంగాఁ దగిన పటమొ వివరింపు వెసన్.

భాను—ఓ దైవమా!

గీ. శత్రువులు కూర్మి చుట్టాలఁ జూచినారు
జనకుఁ డేమొనరించును శరణొసంగ
గూల్చెద నటంచు శపథమ్ము సల్పినాఁడ
జెల్ల రే! యిప్పు డేనేమి చేయువాఁడ!

సుబా,—చంద్రి—సార్వభౌమా! మా కభయ మిచ్చితివి. మఱి యొక లాగునఁ జేయఁ గూడదుసుమా!

రామ—(తనలో) ఇప్పుడు నేనేమి సేయుదును? శత్రువులు నా సోదరుని బుత్రులను గూల్చినారు. సూర్యోదయము కాక మున్నె వారిని సంహరించెద నని శపథము బట్టినవాఁడను నా పెద్ద కొడుకు యువరాజు, మఱియు నిప్పుడేక పుత్రుఁడు. అభయ మిచ్చిన వాఁడను నేను నా కంఠమునఁ బ్రాణము లున్నంత వఱకు సుబాహు చంద్రి సేనులకు భయము లేదు. నేను గూల్చిన క్షత్రియులును గూలుదురు ఏను బ్రతికి యున్న నా సుతుఁడు బ్రమ్మగును. నా మన మిప్పుడు పరి పరి విధములఁ బోవుచున్నది. ఇంత విచార మెందులకు? పుత్రుఁ డెక్కువ వాఁడా? ధర్మ మెక్కువ దా? కొడుకన నెవఁడు? తండ్రియన నెవఁడు? ఆత్మకును బుత్రునకును సంబంధ మున్నదా? ఆత్మయు బంధుగులును కర్మ వాహినులఁ బడి కొట్టుకొని వచ్చి సంసార సాగరమునఁ గలిసిరి. మఱల నాత్మకును బంధువులకును వియోగ మేర్పడి యున్నది. కావున నాత్మకును బంధుగులకును సంబంధ మెంత మాత్రమును లేదు. ఆత్మకును ధర్మమునకును సార్వకాలిక మగు నవినాభావ సంబంధ మున్నది. కావున ధర్మ మత్యావశ్యకము. నేనిప్పుడు ధర్మమునే పరిపాలింతును. భానుమంతునితో నే నిప్పుడు పోరాడెదను.

సుబా—(జనాంతికముగఁ జంద్రి సేనునితో) మిత్రమా! వీని ముఖ లక్షణములను జూడ మనలను రక్షించు నట్లు తోఁచుట లేదు.

# పంచమాంకము.

చంద్ర—(సుబాహునితో) దైవయోగ మెట్లున్నదో?

భాను—(తనలో) నేనిప్పుడేమి సేయ వలయును? నా తండ్రిని బరిమార్పకుండ సుబాహు చంద్రసేనుల నోడియుం జేయం జాలను. చేయకున్న నేనసత్య ప్రతిజ్ఞుండ నగుదును. శపథమును వదలి పెట్టుదునా? జనకుని జంపుదునా? జనకుని జంపుదునా? ఛీ ఛీ!! ఎంత ఘోరము! సుతులకుం దండ్రి పరమ పూజ్యుండు. నా తండ్రిని జంపినచో నా తల్లి యెడల మహాపరాధమును గావించిన వాండ నగుదును. నా పట్టుగొమ్మను నేనే పడంగొట్టుకొనిన వాండ నగుదును. కావున తండ్రితోం బోరం జనదు. (ఆలోచించి) ఏమనుకొంటిని? శపథమును విడుచుటా? సూర్యోదయము కాక మున్న సుబాహు చంద్రసేనులను సంహరించుట నా ధర్మము. ధర్మమే ముఖ్యము. పుత్రుం డెవండు తండ్రి యెవండు? ఇరువురకు సంబంధమేమి? ఎంత మాత్రమును సంబంధము లేదు. ఆత్మకును ధర్మమునకు నవినాభావ సంబంధ మున్నది. కావున నేను నాధర్మమును విడువం జాలను.

సుబా—(తనలో) సార్వభౌముండు పుత్రుని మీంది గాఢానురాగముచే మన్ను గాపాడ లేండేమో గదా?

చంద్ర—(తనలో) వీరి యభిప్రాయమేమో? ఎంత సేపీ యాలోచనము?

రామ—భానుమంతా! శపథమును వదలు కొందువా?

భాను—ధర్మమును విడుచుట దోషము గాదా?

రామ—నీ కా భయమక్కఱ లేదు. పెద్దల యాజ్ఞాప్రకారము ప్రవర్తించిన నే దోషములు నంటవు. శపథమును దీర్చుకొనుట కన్నం బిత్రాజ్ఞా పరిపాలనము ముఖ్యమైనది.

భాను—పిత్రాజ్ఞానిరసన మాత్మ ద్రోహము కన్నం దీవ్రమైనదా?

రామ—అట్లయిన నన్నెదిరించి పోరెదవా?

భాను—పోరినను మానినను మీదే భారము.

రామ—(తనలో) భానుమంతుని యెడ నే నెంత పుత్రానుబంధచ్ఛేదము గావించు కొనినను భానుమంతుని మాటలు నాహృదయమును వ్రక్కలు సేయుచున్నవి. పోరినను మానినను నాదే భారమఁట. ఈ మాటలలో నెంత యర్థ మున్నది! పోరినచో నేనయినను భానుమంతుఁడయినను దప్పక చావ వలయును. మా యిరువురలో నెవని మడిసినను లోకులు నన్నే నిందింతురు. మానినచో భానుమంతుని శపథము చెల్లదు. నా కడుపునఁ బుట్టిన వాఁడు ప్రతిజ్ఞా పాలకుఁడు గానిచో నా యపకీర్తి నాది గాదా? (ప్రకాశముగా) భారము మాట యటులుండ నిమ్ము. నన్నెదిర్చి పోరుదవా?

భాను—నాశపథమును నేను నెఱవేర్చి కొందును.

రామ—నేనేనా ప్రతిజ్ఞను దీర్చు కొనఁ జాలని వాఁడను?

భాను—అయినచోఁ బోరుదము.

రామ—(మహాగ్రహముతో) ఓరీ! డింభకా! నాతోఁ బోరి గె[illegible]గలవా?

భాను—జయాపజయములు దైవాధీనములు.

రామ—ముమ్మాటికి యుద్ధమే చేసెదవా?

భాను—ప్రతిజ్ఞాపరి పాలనము గావించుటకు నా ప్రాణముల నైన విడిచి వేసెదను.

రామ—అయినచో నిఁక నీ ప్రాణములు నిలువవు.

భాను—నేను చచ్చెదనో బ్రతికెదనో చెప్పుటకు మీ కధికారము లేదు.

రామ—నేను నీకన్నఁ బెద్దవాఁడను. ఆరితేరిన వాఁడను. నీవు నా

యెంత సమర్థుఁడవా?

భాను—కావచ్చును. కాక పో వచ్చును. ఇప్పు డా విచార మనావశ్యకము.

రామ—తప్పక చచ్చెదవు?

భాను—అట్లైనచో నా కొఱకు స్వర్గద్వారములు తెరవఁబడును.

రామ—స్వర్గమునకుఁ బోవ మనసగుచున్నదా?

భాను—స్వర్గమును గోరని వా రెవ రుందురు? ఎప్పు డెట్టి మరణ మాసన్నమగునో. ఇప్పుడైనచో నాకు నిస్సందేహముగ స్వర్గము లభించును.

రామ—అయినఁ గాచి కొనుము.

భాను—సిద్ధముగ నున్నాఁడను.

రామ—నిన్ను జూచిన నాకు జాలి కలుగుచున్నది. పిల్లవాఁడవు. అజ్ఞానుఁడవు. తొందర పడుచున్నావు. చెడిపోయెదవు. ఆలోచించు కొనుము.

భాను—నా కాలోచించు కొన వలసిన దేమియులేదు. నా శపథమును వదలు కొను మని చెప్పుచున్నారు. అట్లైన నేను విజ్ఞానవంతుఁడ నయ్యెదనా?

రామ—అయ్యెదవు.

భాను—అప్పుడు నా విజ్ఞానత్వము నకుఁ బిన్న తన మభ్యంతరము గల్గింపదా?

రామ—ఓరీ! నీ వాచాలత్వము మేర మీఱుచున్నది. ఇఁక నేను సహింపను.

భాను—సహింపుమని నేను బతిమాలు చుంటినా?

రామ—కోరినను సహింపను. కత్తి గలుపుము.

భాను—ముందు మీరు కలుపుఁడు.

రామ—ఇదిగోఁ గలిపితిని.

( ఇరువురుఁ బోరుచున్నారు. )

చంద్రి—(తనలో) ఈ పోరాటమున భానుమంతుఁడు కడ తేఱినచో మే మదృష్టవంతులము. ఇరువురును గడతేఱినచో నింక మా పుణ్యమునకు మేర యెక్కడిది?

సుభా—(తనలో) దైవమా! మమ్ము రక్షింపుము.

( తెరలో )

ఆఁ! ఏమి యీ విపరీతము!

చ. చెనఁటులు రాచవార లని సేయఁగఁ జాలక; మీర లొండొరుల్
దునుము కొనంగఁ జేయ నేఁడు దుర్గతులై శరణాన్న యంత ని
మ్మనమునఁ బొంగి శాత్రవ సమాజము సర్వఁగ నిర్విధమ్ముగా
జనకుఁడుఁ బుత్రుఁడున్ రణముసల్పఁగ న్యాయమొ? పోరుమానుఁడీ!

(అప్పుడు ప్రళయభైరవుఁడు ప్రవేశించి పోరు మాన్పించుచున్నాఁడు)

సుభా.—చంద్రి—(తమలో) హా! చచ్చితిమి చచ్చితిమి! హా దైవమా! విధము చెడినను ఫలము దక్క నట్టులున్నది.

ప్రళయ—సార్వభౌమా! ఏమిది? పుత్రుని తోడనా పోరాడెదవు? భానుమంత రెడ్డీ! గురు జనముల యెడలఁ జూపవలసిన వినయ విధేయతలా యివి?

( తెరలో )

ఓరీ! సార్వభౌముఁడును యువరాజు నింకఁ బోరుచునే యున్నారా? మహాదేవరెడ్డీ! రమ్ము రమ్ము. అయ్యో! ఈ సంగతి గురువర్యునకుఁ దెలిసినదో లేదో గదా!

ప్రళయ—అదిగో సేనాను లేతెంచుచున్నారు. మన సైన్యమెల్ల

విరగఁ బడు నట్లు తోఁచు చున్నది. అన్నా! ఎంత సంక్షోభము గల్గెను.
(అప్పుడు వేగముగ మహాదేవ రెడ్డితో హేమకూటారెడ్డి ప్రవేశించును)

హేమ—గురువరా! దయచేసితిరా? సార్వభౌమా! ఏమి యీ విపరీతము!

మహా—దేవా! నీవు కోపించిన ముజ్జగములు దల్లడిల్లి పోవా?

హేమ—అన్నా! క్షత్రియాధము లెంత యన్యాయమున కొడిగట్టిరి! సార్వభౌమా! యువరాజా!

చ. "అడఁచెద" నంచుఁ "గాచెద" నటంచుఁ బ్రతిజ్ఞలఁ దాల్చినట్టి యా
రుషాకుఁడు; రెడ్ల వాఁడిమికి నోర్వఁగఁ జాల ప్రాలి కాళ్లపై
బడియును లేక; తండ్రికిని బిడ్డకుఁ గయ్యము గల్పి నట్టి యీ
చెనుగుల క్షత్రియాధములఁ జీల్చెదఁ దీర్చెద రెడ్ల ద్వేషముల్.

(అని సుబాహు చంద్రసేనులపైఁ బడఁబోవును)

రామ—సేనాధిపా! త్వరపడకుము. (అని యాతని వారించును)

భాను—మహాత్మా! ఈ సుబాహు చంద్రసేనాధములు అర్ధరాత్రి వేళ నేతెంచి నా పితృశ్రీని నా తమ్ములను సంహరించి, యంతటితోఁ దృప్తిపొందక నన్ను దునుముటకై నా గుడారము జొచ్చిరి. నా సోదరుల రోదన ధ్వని విని నేను మేల్కాంచియుంటిని గాన నన్ను వధింప వచ్చిన యిద్దురాత్ములపైఁ బడితిని. అప్పుడు వీండ్రిరువురు నా సామర్థ్యమున కోర్వఁజాలక పలాయనము గావింప వెంట నంటి యిట్లు ప్రతిజ్ఞఁ దాల్చితిని. (అని "వనధిఁ గ్రుంగిన" అను పద్యముఁ జదివి) ఈ శపథమును నేను తీర్చుకొన వలదా?

హేమ—ఏమీ? ధర్మారెడ్డిని, రామదేవ కరహాటక రెడ్లను సంహరించి వైచిరిగా క్షత్రియాధములు!

మహా—దేవా! అట్టి క్షత్రియాధములను సంహరింపకుపేక్ష యేల?

రామ—ఆలకింపుఁడు గురువర్యా! నిన్న జరిగిన సంగ్రామమునఁ గలిగిన బడలికచే నొడలు మఱచి గాఢ సుషుప్తిం జెందియుండఁగా నీ క్షత్రియులత్యార్తులై వచ్చి శరణుజొచ్చిరి. ఆ హేతువుచే నప్పుడు వారికే నిర్భయ మిచ్చితిని. (అనిసురగంధర్వ అను వాక్యము చదివి) అట్టి నా శపథమును దీర్చుకొన వలదా?

సోమ—ఈ తుచ్ఛులు మోసపుచ్చి యభయము గాంచిరి. అట్లగుటచే మోసకాండ్రగు నీ క్షత్రియాధములు వధ్యులు.

మహా—ప్రాతి నేమముల సంగతి యటులుంచి యాక్రాంత నేరమునకు వీరు వధ్యులు.

ప్రళయ—సేనాధిపురావా! మీకొక్కింత తడవు శాంతిల వలయు. యువరాజా! నీ యాప్త బంధువుల నన్యాయముగఁ జంపిన క్షత్రియులను సంహరింప నీవు ప్రతిజ్ఞఁ బూనుట యుక్తముగనే యున్నది. సార్వభౌమా! శత్రువు లెట్టి వారైనను నభయము గోరి నప్పుడిచ్చుట స్వామి ధర్మమగుటచే నీ వభయ మిచ్చుటయు బాగుగనే యున్నది. యనసంయుంతి మా ప్రాణమునకుఁ దండ్రియుఁ గొడుకు నన్యోన్య సంహారకులై పోరాడ స[illegible]?

చంద్ర—(తనలో) ఈ బ్రాహ్మణుఁడు తెగియుఁ దగని కత్తిచే మా కంఠములను గోయుచున్నాఁడు. మా కర్మ మెట్లున్నదో.

సుభా—(తనలో) ఓరీ! బ్రాహ్మణాధమా! సమయమునకు నీ వెక్కడ దాపరించితివిరా!

రామ— భాను—గురువరా! మఱేమి సేయ వలయును?

ప్రళయ—ఈ యాలోచన మింతకుమున్న నాతోఁ జేయ వలదా?

రామ—గురువరా! మఱచి పోయితిని. క్షమింపుఁడు.

భాను—సూర్యోదయము గాకుండ శపథమును నెఱవేర్చి కొనవ

